1

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

## ఈ సంక్షోభాలకు కారకులెవరు?

సంపాదకీయం

## మధ్యవర్తులు (కథ)

అల్లం రాజయ్య

## విశ్వనాథ సాహిత్యం - మత, కుల విషం

త్రిపురనేని మధుసూదనరావు

పాపం ఓటు! (స్కెచ్) నవత

కిరణ్ మురళి, ఆప్తచైతన్య, మేఘశ్యామ్,
గౌతమ్. రమణ, ఝరిల కవితలు



# వాడికి భవిష్యత్తు లేదు

ఇప్పుడిక్కడ మనిషి జీవించడం నేరం - అసలిక్కడ జీవితమే నిషిద్ధం
ఈ నిర్భాగ్య నగరపుటిరుకు గల్లీలన్నీ ఇపుడు యంత్రీకృత కబేళాలు
ఇప్పుడిక్కడ ఏ అభాగ్యుడి ఆర్తనాదానికీ
క్లోరోఫాం తాగిన కిరాయిగుండెలు కదలవు
ఏ పసిపాసిపాప లేతస్పర్శకీ నెత్తురుతో కైపెక్కిన కసాయి కత్తులు కరగవు
ఇప్పుడిక్కడ మతం ఒక మారణాస్త్రం
మనిషి శ్రమని తాగి బలిసినోడి చేతిలో బిగిసిన ఆయుధం
వాడి భూదాహమూ, ధన దాహమూ, అంతులేని పదవీ వ్యామోహమూ,
దానికి రక్తదాహం పుట్టిస్తుంది
వేలప్రాణాలు బలి యిచ్చయినా
గబ్బిలాలు వేలాడే తన శిథిల గృహానికి కరసేవ చేయిస్తుంది
నిస్సహాయ ప్రజల మీద చెలరేగి
నెత్తుటి నర్మెట్టలు సృష్టించే గంధకం గొట్టాలు
మతం, వీధుల్ని మానవ రుధిర సాగరాల్ని చేస్తున్నా పోలీసు చంక దిగదు
ఇప్పుడిక్కడ మతం ఒక మత్తుమందు
ఖాకీలూ, ఖద్దర్లూ దాని రక్షకులు, మసీదులూ, మందిరాలూ దాని స్థావరాలు
దానికి ప్రాణం తీయడం తప్ప వూపిరిపోయడం రాదు
దానికి మానవ హాహాకారం తప్ప మరో సంగీతం తెలీదు
గిడచబారిన వాడిగిట్టల మధ్య తప్ప దానికి మరో వునికి లేదు
ఇక్కడిప్పుడిప్పుడే మనిషి మనుగడకోసం తెగిస్తున్నాడు
నూత్న ప్రపంచ గీతాన్ని స్వరిస్తున్నాడు
మతాల మారణాయుధాల్ని మరిగించి కరిగించడానికి కొలిమి రాజేస్తున్నాడు
ఖాకీ కోరలు చేసిన గాయాలు సలుపుతున్నా మృగాల వేట సాగిస్తున్నాడు
రక్తం తాగి బలిసిన పాలకుడి పీడ వదిలించేందుకు
పదునైన వ్యూహం పన్నుతున్నాడు
రేపటికిక్కడ ఆయుధాలన్నీ ఆస్తిత్వం రాల్చుకోగా
మార్చురీ గదిలో వంటరైనవాణ్ణి వలుకరించే దిక్కుండదు
సామూహిక శ్మశానంలో శవాలన్నీ బహిష్కరించగా
పూడ్చిపెట్టే చోటుండదు - రేపిక్కడ వాడికి వునికుండదు

—కిరణ్

# ఈ సంక్షోభాలకు కారకులెవరు?

"అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టుపెట్టిన అందం నీది
సంపన్నుల చేతుల్లో మైమరచి నిద్రిస్తున్న యవ్వనం నీది
ఊసినా దుమ్మెత్తిపోసినా చలనం లేని మైకం నీది"

అని పాతికేళ్ళ క్రితమే చెరబండరాజు చెప్పగలిగిన మాటలు ఇవాళ భారత ప్రజలందరి అనుభవంలోకి వచ్చేశాయి. ఇటీవల టన్నుల కొద్దీ బంగారాన్ని మాజీ ప్రధాని చంద్రశేఖర్ అమ్మేయడం వల్లనో, ప్రస్తుత ప్రధాన మంత్రి పి.వి. నరసింహారావు బంగారాన్ని తాకట్టు పెట్టడం వల్లనో మాత్రమే ఈ పరిస్థితి రాలేదు. ఏదైనా హఠాత్తుగా జరగదు. ప్రతిదానికీ ఒక పరిణామం ఉంటుంది. నాలుగు దశాబ్దాల కాంగ్రెస్ పాలన 'చలవ' ఇది. 1947 ఆగష్టు 15న నీళ్ళను మరగబెట్టడం ప్రారంభించింది పాలకవర్గం. ఈనాటికి నూరు డిగ్రీల దగ్గరకు చేరి నీరంతా ఆవిరైపోయింది.

1947 ఆగస్టు 15 దాకా బ్రిటీష్ వాళ్ళు మాత్రమే భారత దేశాన్ని దోచుకునే వాళ్ళు. అప్పుడు 'స్వాతంత్ర్యం' రావడంతో బ్రిటన్‌తో బాటు అమెరికా, రష్యాలతో బాటు ఎవరికైనా భారత దేశాన్ని దోచుకునే హక్కు లభించింది. అప్పటిదాకా వందల కోట్లల్లో ఉన్న టాటా బిర్లాల పెట్టుబడులు ఆ తర్వాత వేల కోట్లల్లోకి మారిపోయాయి. 44 ఏళ్ళ ప్రజాస్వామ్యం సామాన్య ప్రజల రక్తమాంసాల్ని పీల్చి పిప్పి చేసింది.

ఇవాళ భారత ప్రభుత్వానికి స్వదేశీ, విదేశీ అప్పులు మొత్తం మూడున్నర లక్షల కోట్ల రూపాయలకు పెరిగాయి. ప్రతి సంవత్సరం వేలకోట్ల రూపాయలలో వడ్డీని చెల్లిస్తున్నాం ఈ సంవత్సరం వడ్డీలు చెల్లించడానికి 28 వేల కోట్ల రూపాయల మొత్తాన్ని బడ్జెట్‌లో చేర్చారు. కొద్దిరోజుల్లోనే రూపాయి మారకపు విలువను నాలుగుసార్లు తగ్గించారు. 1966లో రూపాయి విలువను 35 శాతం తగ్గించారు. ఇప్పుడు 20 శాతం తగ్గించారు. అనాడు రూపాయి విలువ తగ్గించడం వల్ల ఎగుమతులు పెరుగుతాయనీ, దిగుమతులు తగ్గుతాయనీ, ఆర్థిక వ్యవస్థ పటిష్టం అవుతుందనీ ఏ అబద్దాలు చెప్పారో ఈనాడూ ఆ అబద్దాలే చెబుతున్నారు. 1981లో ఒక అమెరికా డాలరుకు 8.66 రూపాయలు. 1991లో 26.02 రూపాయలు. 1981లో బ్రిటన్ పౌండుకు 17.56 రూపాయలు. ఈనాడు 41.72 రూపాయలు. అంటే ఒక దశాబ్దంలో రూపాయి విలువ ఎంత గణనీయంగా పడిపోయిందో తెలుస్తోంది. ఒకటి రెండు సందర్భాల్లో తప్ప ఎప్పుడూ ఎగుమతుల కంటే దిగుమతులే ఎక్కువ. మన దేశంలో మన రూపాయి విలువ 7 పైసలకు పడిపోయింది. మన ప్రభుత్వం అనుసరించే దివాళాకోరు ఆర్థిక

విధానాల్ని దృష్టిలో పెట్టుకొనే విదేశాలు మన రూపాయిని నమ్మడం మానేశాయి. అందుకే మన రూపాయి మారకపు విలువను తగ్గించేస్తున్నాయి.

ఈ నేపథ్యంలో మన్‌మోహన్‌సింగ్ బడ్జెట్ వచ్చింది బడ్జెట్ కఠినంగా కనిపించినా అది అనివార్యం అన్నారు. ప్రస్తుత ఆర్థిక సంక్షోభాన్ని తట్టుకోవాలంటే కఠిన చర్యలు తప్పవన్నారు. అంటే ఇది కాకుల్ని కొట్టి గద్దలకు పెట్టే బడ్జెట్ అని వాళ్ళే ఒప్పుకున్నట్టయింది. విదేశీ పెట్టుబడులకు గేట్లు బార్లా ఎత్తేశారు. ఐ.యం.యఫ్.కు దాసోహం అన్నారు. లేవమంటే లేశారు కూర్చోమంటే కూర్చున్నారు. అడక్కముందే పాదాలు పట్టుకున్నారు. మాయలఫకీరు ప్రాణం సప్తసముద్రాలవతల చిలకలో ఉన్నట్టు మన ఆర్థిక వ్యవస్థ జుట్టు ప్రపంచ బ్యాంక్ చేతిలోకి పోయింది. ప్రపంచ బ్యాంకుకు 'అమెరికా' అనేది పర్యాయపదం అని తెలిసిన విషయమే. ఇవన్నీ దాచేస్తే దాగని సత్యాలు.

నీకంటే నేనేం తక్కువ తినలేదన్నట్లుగా ఆర్థిక సంక్షోభంతో పోటీపడుతోంది బూర్జువా రాజకీయ సంక్షోభం. మొన్నటి ఎన్నికలు అందుకు నిదర్శనం. ఏ పార్టీకి పూర్తి మెజారిటీ రాలేదు. అంటే అన్ని పార్టీలపైనా ప్రజలకు నమ్మకం పోయిందనాలి. మైనారిటీ ప్రభుత్వాల యుగం ప్రారంభమైంది. ప్రజల పళ్ళూడగొట్టడానికి మెజారిటీ రాయే అక్కరలేదు, మైనారిటీ రాయైనా సరిపోతుంది. అంతకంటే విచిత్ర పరిస్థితి ఏమిటంటే మైనారిటీ ప్రభుత్వాన్ని నిలబెట్టడానికి ప్రతిపక్షాల హాహాకారాలు, ఆర్తనాదలు! మైనారిటీ ప్రభుత్వం పడిపోతే మళ్ళీ ఎన్నికలను భరించే శక్తి దేశానికి లేదని, అది ప్రజలపై విపరీతమైన భారం మోపుతుందని ప్రతిపక్షాలు మొసలి కన్నీరు కార్చాయి. దేశం పట్లా, ప్రజలపట్లా ప్రతిపక్షాలకు అంత ప్రేమ ఉన్నట్టుండి ఎక్కడ పుట్టుకొచ్చింది? నిజానికి సమస్య అది కాదు. మళ్ళీ ఓట్లడగటానికి ప్రజలకు మొఖం చూపించే నైతిక ధైర్యం వాటికి లేదు. మొదట్లో ప్రజలు కొంత కాలం ప్రభుత్వం మాటలు నమ్మేవాళ్ళు. ఆతర్వాత కొంత కాలం ప్రతిపక్షాల మాటలు నమ్మేవాళ్ళు ఇప్పుడు ఎవరి మాటలూ నమ్మడంలేదు. వాస్తవాల్ని గుర్తిస్తున్నారు, వాటినే నమ్ముతున్నారు.

అసలు మన పాలక వర్గాలకు దేశాన్ని ఎలా అభివృద్ధిచెయ్యాలో, దాన్నెలా ముందుకు తీసుకువెళ్ళాలో, సమస్యలనెలా పరిష్కరించాలో, ప్రజాస్వామ్యం అంటే ఏమిటో ఆలోచించే తీరికా, ఓపికా ఎక్కడివి? పదవి ఉన్నన్నాళ్లూ దాన్నెలా కాపాడుకోవాలో, ఎంత వెనకేసుకోవాలో, అసంతృప్తివాదుల్ని ఎలా బుట్టలో వేసుకోవాలో, గుట్టుచప్పుడు కాకుండా దేశాన్ని ఎవరెవ

రికి ఎలా అమ్మాలో- వీటితోనే సరిపోయె! ఇటీవల అధికారం వైపు దూసుకు వస్తోన్న మతతత్వపార్టీ బి.జె.పి. ప్రజలకు ఇళ్ళు కట్టించే విషయం మాట్లాడక పోయినా కనీసం తమ అధికారం కోసం రాముడికి గుళ్ళు కట్టిస్తానంటోంది. ఏ పార్టీని సమర్థించాలో అర్థంకాక రివిజనిస్టు పార్టీలు తలగోక్కుంటున్నాయి. ఈ పార్టీలన్నీ ప్రజల దగ్గరికి వెళ్ళి దేశాభివృద్ధినిగూర్చి, సమస్యల పరిష్కారం గూర్చి మాట్లాడి ఓట్లు సంపాదించడం అసాధ్యం అని తెలుసుకున్నాయి. అందుకే దొమ్మీలూ, బెదిరింపులూ, హత్యలూ, రిగ్గింగులూ, బ్యాలెట్ పెట్టెలు ఎత్తుకుపోవడాలూ మొన్నటి లోకసభ ఎన్నికల్లో పరాకాష్ఠకు చేరుకున్నాయి. అవినీతి, అరాచకాలు, నల్లడబ్బు మురికి కాల్వల్లా పారి దేశమంతా కంపు కొట్టింది. ఇకముందు మన ఎన్నికలు, మన రాజకీయాలు, మన ప్రజాస్వామ్యం ఎలా ఉంటాయో మొన్నటి ఎన్నికల్లో అందరికీ అర్థమయిపోయింది. బ్యాలెట్‌ను కాపాడాలనే నెపంతో అధికార అనధికార పార్టీలు బుల్లెట్‌ను ఆశ్రయిస్తున్నాయి. నక్సలైట్లు హింసావాదులని గగ్గోలుపెట్టే ఈ గోముఖ వ్యాఘ్రాలన్నీ విచ్చల విడి హింసకు పాల్పడుతున్నాయి.

ఇప్పుడే అందిన వార్త! రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉంది గనక గుంటూరు జిల్లా చుండూరు గ్రామంలో దాదాపు 20 మంది హరిజనుల్ని కాంగ్రెస్ భూస్వాములు దారుణంగా చంపేశారు. తెలుగుదేశం నాయకులు ఇది పైశాచిక కృత్యం అన్నారు. తెలుగుదేశం భూస్వాములు కారంచేడులో మారణకాండ సృష్టించినప్పుడు కాంగ్రెస్ వాళ్ళు దారుణం అన్నారు. వాళ్ళిద్దరి గుట్టూ ప్రజలకుతెలుసు! ఎవడైతేనేం ఒక్కొక్కడు మహాహంతకుడు! మతోన్మా దాన్నీ, కులతత్వాన్నీ రెచ్చగొట్టి ప్రజల్ని సమిధలుగా మార్చడంలో కాంగ్రెస్, తెలుగుదేశాలు పోటీపడుతున్నాయి.

భారతదేశంలో అపారమైన ప్రకృతి వనరులు, మానవ వనరులు ఉన్నాయి. వాటిని ఎలా వాడుకోవాలో గుర్తించనంత కాలం, నిజమయిన ప్రజా ప్రభుత్వ వ్యవస్థ రానంతకాలం ఈ మారణహోమం సాగుతూనే ఉంటుంది. ప్రజలు తిరగబడేదాకా ఈ రావణకాష్ఠం కాలుతూనే ఉంటుంది. దున్నేవాడికి భూమి దక్కనంతకాలం, శ్రమసాధనలకై, ఉత్పత్తులకై శ్రమజీవులకు ఆధి పత్యం రానంతకాలం ప్రజలు ఈ దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించక తప్పదు.

"చర్యపై ప్రతిచర్య రాదా, హింసకొక ప్రతిహింస లేదా" అని శ్రీశ్రీ అన్నట్టు ఆపరేషన్ రెడ్‌స్టార్ జరిగే దశ త్వరలోనే ఉంది. దాన్ని త్వరితం చెయ్యడమే మన కర్తవ్యం. ○

# స్వప్నవాస్తవం కోసం....

జీవితాలు సందిగ్ధావస్థలో పడ్డప్పుడు
ఆయుధాలు అసందిగ్ధంగా చోటుచేసుకుంటాయి
జీవితాలు సంధ్యావస్థలోనే ఉదయిస్తున్నప్పుడు
శరీరంలోని భాస్వరం స్వేచ్ఛా వాయువుకే మండుకుంటుంది
జీవితం వొరిగిపోతున్నప్పుడు ఎముకల్లోని ఇనుము
బుల్లెట్ అవసరాలకీ వినియోగించబడుతుంది
స్వప్న వాస్తవంకోసం శరీరంలోని ప్రతి నరం
శత్రువుకేసి సారించబడుతుంది.

—కె. మురళి

# కిరణం

కళ్ళలో నిప్పులుకాదు పోసుకోవటం
వత్తులు వేసుకు చూడాలి!
కన్నీళ్ళు సముద్రాలై పొంగినా
గుండె దోసిలితో పట్టుకోవాలి!
కాలం కరకు కరవాలమై
నీ ఆశల్ని నరికినా
బీడు పొలాల్ని దున్ని
భూమిని పగలగొట్టాలి నీటికోసం!

చుట్టూ అగ్నిపర్వతాలు బ్రద్దలవుతాయి
వాటిసెగల్నే ఊపిర్లుగా మార్చుకోవాలి!
బుల్లెట్లూ, బాయ్‌నెట్లూ
పిడుగులై కురుస్తోన్నకొద్దీ
నువ్వు ఉక్కుమనిషివి కావాలి!
మర్రిచెట్లు ఊడలేస్తాయి
జాగ్రత్త!
సూర్యకిరణమై దూసుకుపో!

—ఆప్తచైతన్య

# సంతకాలు

పేదవాడి
బతుకు పుస్తకపు
ప్రతి పేజీలో కూడా
ధనవంతుల
దౌర్జన్యపు సంతకాలే!

—మానుకొండ నాగేంద్రప్రసాద్



కథ

# మధ్యవర్తులు

—అల్లం రాజయ్య

[అల్లం రాజయ్య "మధ్యవర్తులు" కథకు ఇటీవల కొడవటిగంటి కుటుంబరావు అవార్డు వచ్చింది కొడవటిగంటి వరూధిని గారు ఈ అవార్డును ఏర్పాటు చేశారు. రావి శాస్త్రి, కాళీపట్నం రామారావు గార్లు న్యాయనిర్ణేతలు. ఈ కథ 1990 ఆంధ్రజ్యోతి వారపత్రిక దీపావళి ప్రత్యేక సంచికలో అచ్చయింది. అవార్డు వచ్చిన సందర్భంగా అరుణతార పాఠకుల సౌకర్యార్థం ఈ కథను పునర్ముద్రిస్తున్నాం. —సం॥]

బొయ్యిన గాలి వీస్తోంది. ఆ గాలికి చెట్లు ఫెళ ఫెళమంటూ, కీచుకీచుమంటూ రొద చేస్తూ ఊగుతున్నాయి. కుండపోతగా వర్షం కురుస్తోంది. కరంటు తీగలు జుంయ్యుమని మోగుతున్నాయి.

ఒక చిల్లుల గుడిసెలో చిరుగుల అంగి పిల్లవాడు శరీరాన్ని కోత పెట్టే గాలికి కెవ్వున కేకేశాడు చీకటి నిండిన గుడిసెలో మెరుపు మెరిసినప్పుడల్లా కప్పు నుండి కారే నీటి ధారలకు ఒక పేద తల్లి మట్టి మూకుల్లు పెడుతోంది. తలుపు రెక్క కిరకిరలాడుతూ ఊగి దబెలున పడిపోయింది.

పిల్లవాడు ఆ చిమ్మంచీకట్లో నేలంతా బురదైపోయిన ఆ గుడిసెలో "అవ్వా... అవ్వా" అంటూ ఏడుస్తున్నాడు. ఎక్కడో ఫెళ ఫెళ చెట్లు కూలిన శబ్దం. "అవ్వా" దిక్కులు పిక్కటిల్లే లాగున పిల్లవాడు అరుస్తున్నాడు.

"ఇక్కన్నేరా నాగేంద్ర" తల్లి ఏడుపు గొంతుతో చేతులు చాచి అరుస్తోంది కాని ఆ అరుపు ఆ చీకట్లో, ఆ తుఫాను హోరులో పిల్లవాన్ని చేరడం లేదు.

"అవ్వా ... అవ్వా" పిల్లవాడు గుడిసంతా వెతుకుతున్నాడు దడెల్లున గుడిసె కూలిన పెద్ద శబ్దం

డాక్టర్ నాగేంద్రం హఠాత్తుగా లేచి కూర్చున్నాడు. బయటి వాతావరణం కల్లోలంగా, బీభత్సంగా వున్నది. తుఫాను గాలి రొద పెడుతోంది జంగిలా కిటికీ రెక్కలు కొట్టుకొని వాటికి అమర్చిన గాజు పలకలు పగిలి పోయాయి.

నాగేంద్రం ఇంకా కల నుండి తేరుకోనేలేదు అతను ముందు గదిలో ఒక బల్ల మీద శద్దరు మాత్రమే పరుచుకొని పడుకున్నాడు కిటికీల నుంచి వచ్చిన జల్లుకు పక్కంతా అప్పటికే తడిసిపోయింది.

బయట గాలి రొద పెడుతోంది చిమ్మ చీకటిలో నేషనల్ హైవే మీద కాబోలు చెట్లు కూలుతున్న చప్పుళ్ళు. కరంటు ఎప్పుడు పోయిందో తెలియదు. ఉండీ ఉండీ ఫెళ ఫెళ ఉరుముతోంది. ఆ వెనువెంటనే తళుక్కున మెరుపు వర్షం కుంభవృష్టిగా కురుస్తున్న మోత- కిటికీలో నుండి చూస్తే తెల్లగా నీటి ప్రవాహం. ఆ తుఫాను గాలిలో వేనవేల గుడిసెలు నేలమట్టమై లక్షలాది గొంతులు రోదిస్తున్నట్లుగా వున్నది. కల నుండి తేరుకొని 'నా జన్మలో చూడనంత తుఫాను' అనుకున్నాడు నాగేంద్ర. ఈ పాటికి ఇస్లాంపురా, స్పిన్నింగ్ మిల్లు ఏరియా జలమయమైపోయి వుంటుంది" అనుకున్నాడు.

ఆ వర్షంలో ఆ తుఫాను గాలిలో తడిసి ముద్దయిపోయిన రెండేండ్ల కొడుకును చంకలో వేసుకొని, నల్లగా, బీద బీదగా వున్న ఒక తల్లి చేతులు చాచి తన్ను పిలుస్తున్నట్లుగా అన్పించింది. తను పూర్తిగా చిక్కని చీకటిలో తుఫాను గాలిలో చిక్కుకుపోయాడు.

కిటికీ రెక్కలు ఇంకా కొట్టుకుంటూనే వున్నాయి. నాగేంద్రం లేచి వాటిని మూయడానికి తంటాలు పడ్డాడు. ఇంకా వార్నీసు వాసన పోని తలుపులను మూయడం కూడా తనకింకా అలవాటు కాలేదు. ఇల్లు కట్టి అందులోకి ప్రవేశించి ఇంకా మూడు నెలలన్నా కాలేదు. తను ఇంతకుముందు ఇలాంటి ఇంట్లో నివసించినవాడు కాదు. మూయని కిటికీ రెక్కలు నాగేంద్రంను అపహాస్యం చేస్తున్నట్టుగా కొట్టుకుంటున్నాయి.

లేచి తడుముకుంటూ హాలులోకి వచ్చాడు. హాలులో ఫర్నీచర్. చీకట్లో ఈ ఫర్నీచర్ అరణ్యాన్ని ఛేదించడం కష్టమే. రెండు అడుగులు వేసేసరికి ఫ్రిజ్ తాకింది. దాని ప్రక్క డైనింగ్ టేబుల్. గోడకు చెయ్యానిస్తే శాంపిల్ మందు సీసాలు ఒకదానికొకటి తాకి శబ్దం చేశాయి.

టార్చిలైటు ఎక్కడున్నదో? ఇలాంటి వస్తువుల మీద పూర్తిగా తన కంట్రోల్ పోయింది. ఏ వస్తువు ఎందుకు వచ్చిందో? అవసరమా కాదా అన్న విషయం అట్లా వుంచి- ఆ వస్తువులన్నింటినీ ఎట్లా ఉపయోగించాలో నేర్చుకొనే ఓపికా, తీరికా లేని బతుకు. వస్తువులు పెరిగిన కొద్దీ తను వాటి మధ్య చిక్కుకపోతున్నాడు.

గుడ్డివానిలాగా గోడలు తడిమాడు. "కొడుకా నాగేంద్రా!" బయట గాలి ముద్దముద్దగా పిలుస్తున్నట్లనిపించింది కిటికీలు ఇంకా కొట్టుకుంటూనే వున్నాయి

వెతకగా వెతకగా ఎట్టకేలకు నాగేంద్రంకు అగ్గిపెట్టె దొరికింది. అదీ మెత్తబడి రెండు పుల్లలుగీకినా వెలుగ లేదు మూడో పుల్ల వెలిగింది. ఆ గుడ్డి వెలుతురులో చిందర వందరగా వున్న వస్తువులన్నీ కాలుతున్నట్టుగా కనిపించాయి. కొవ్వొత్తైనా దొరికితే బావుండును మరో పుల్ల గీకి తనెక్కడున్నాడనేది చూశాడు. బెడ్‌రూం గుమ్మంలో విశాలమైన పక్క.

దాని మీద కుర్లాన్ పరుపులు బోసిగా వున్నాయి. ఆ పక్క మీద తనకు నిద్ర పట్టదు. కిటికీల నుంచి జల్లు కొట్టి పక్క తడిసినట్టుగానే వున్నది. ఆ గది కిటికీలు మూయడానికి ప్రయత్నం చేసి విఫలమయ్యాడు.

అన్ని గదుల్లో గోడ గడియారాలున్నాయి. టైం చూశాడు ఒంటి గంట ఏడు నిమిషాలయ్యింది

గాలి రొద ఇంకా హెచ్చినట్లున్నది. బొయ్యిమని శబ్దం. కొమ్మలు రాచుకునే శబ్దం- కరెంటు తీగల మోత- వాన నేల మీద బాదే శబ్దం. భూమి ఆకాశం హోరాహోరి యుద్ధం చేస్తున్నట్టుగా వున్నది. ఉరుములు- మెరుపులు. ఈ శబ్దాలన్నింటిలో కరెంటు తీగల మోత గొంతు పాలిపోరి ఏడుస్తున్న చిన్న పిల్లవాని ఏడుపులాగా వున్నది.

కిటికీలు తపా తపా కొట్టుకుంటూనే వున్నాయి. కాలెండర్లు పరపర చిరిగిపోతున్నాయి. గాలి విసురుతో తోసుక వచ్చిన జల్లు ఇల్లంతా తడిపే లాగున్నది.

నాగేంద్రంకు కడుపులో నుండి వనుకు తన్నుకు వచ్చింది. తను తడిసి ముద్దయిపోయినట్లుగానే అన్పిస్తున్నది

ఈ తుఫాను ఎప్పుడు ఎక్కడ ప్రారంభమైనదో? ఎప్పుడు ఆగుతుందో తెలియదు.

నాగేంద్రం మరో అగ్గిపుల్ల గీకి ముందు రూంలోకి వచ్చాడు కిటికీ నుంచి బయటకు చూశాడు. చీకట్లో ఇంత తుఫాను గాలిలో కూడా కప్పలు చిత్ర విచిత్రమైన గొంతులతో బెక బెక లాడుతున్నాయి. మెరుపు వెలుగులో ట్రంకు రోడ్డు కాపల ఇంకా కట్టడంలో వున్న సినిమా టాకీసు ఒక పెద్ద రాకాసిలా నిలుచున్నది అది బిల బిల కూలిపోతుందేమోనని నాగేంద్రం భయపడ్డాడు.

అప్పుడు నర్సింగ్ హోం జ్ఞాపకం వచ్చింది. పేషెంట్లు ఎంత గాభరా పడుతున్నారో? డాక్టర్ సూర్యారావు రాత్రి డ్యూటీకి వచ్చాడో లేదో? ఆపరే

షన్ జరిగిన రోగి పరిస్థితి ఎట్లా వుందో? అతని స్మృతిపథంలో ఒక్కొక్క పేషెంటూ మెదిలాడు. అక్కడికి నర్సింగ్ హోం రెండువందల గజాలే. కాని తుఫానులో అక్కడికి పోవడం కష్టమే. కడుపులో నుండి 'దవ' తన్నుక వస్తోంది. తను సాయంత్రం భోజనం చేయలేదని జ్ఞాపకం వచ్చింది. ఉదయం తను లేచేసరికి ఇంటి ముందు పేషెంట్లు తయారు. వాళ్ళను పొమ్మనలేడు. అప్పటి నుండీ నటన మొదలౌతుంది. వాస్తవం డాక్టరు చెప్పజాలడు. అందరికి నమ్మకం కలిగించాలి. తగ్గినా, తగ్గకపోయినా తగ్గుతుందనే చెప్పాలి.

గాలి రొద అంతకంతకూ హెచ్చుతోంది. ప్రకృతి పిచ్చెత్తినట్టుగా వున్నది

ముందు గదిలో పడక కుర్చీలో కూలబడ్డాడు. కండ్లు మండుతున్నాయి. మనసులో ఎక్కడో తుఫాను రేగుతోంది. కళ్ళు మూసుకున్నా నిదుర రాదు. చిరచిరలాడే ముఖంతో నాగేంద్రం భార్య సులోచన రూపుకట్టింది. కొడుకు జ్ఞాపకం వచ్చాడు.

అన్నయ్యలిద్దరూ వేరు కాపరాలు పెడుతున్నారని, తల్లి నగల్లో తనకు వాటా రావాలని తల్లిగారింటికి వెళ్ళింది సులోచన.

పోయేముందు జరిగిన గొడవ జ్ఞాపకం వచ్చింది. "ఓ అచ్చటా.... ముచ్చటా- జన్మకో శివరాత్రంట. కలిసి సినిమా అయినా...."

నాగేంద్రం ఈ రొటీన్ మాటలను జ్ఞాపకం తెచ్చుకోదలుచుకోలేదు. లాభం లేదు. ఈ కుర్చీలో కూర్చుంది కళ్ళు మూసుకుంటే ఇలాంటి జ్ఞాపకాలే వస్తాయి. లేచి నిలబడి పచార్లు చేయసాగాడు

రాను రానూ తను ఒంటరివాడై పోతున్నాడు. తుఫాను గాలిలో చిక్కుకున్న ఒంటరి పక్షి లాగా తడిసి ముద్దయిన రెక్కలు. చేతి నిండా డబ్బు- చుట్టుప్రక్కల గల వంద గ్రామాల్లో నుండి పేషెంట్లు. ఈ టౌన్‌లోనే ఏ డాక్టరుకు లేని ప్రాక్టీసు! అనేక మంది ప్రముఖుల మధ్య కూడా తను ఎడంగా ఒంటరిగా ఎందుకు వుంటున్నాడో తెలియడం లేదు.

మరొక మారు గాలి వీచి కిటికీలు కొట్టుకొని పగలకుండా మిగిలిన ఒకటి రెండు గాజు పలకలూ పగిలిపోయాయి. ఈ బిల్డింగ్ సాంతం విగబడిపోయినా తనేం చేయజాలడు. ఈ వస్తువులను తను కొనగలడేగాని వాటి మీద అధికారం సంపాదించలేకపోయాడు.

తన తోటి డాక్టర్లంతా డబ్బుతో, హోదాతో చాలా సంతోషంగా బతుకుతున్నట్టుగానే తోస్తున్నది. టౌనంతా ఇళ్ళ స్థలాలు కొంటున్నారు., నర్సింగ్

హోంలు కడుతున్నారు. అందరి నర్సింగ్‌హోంల్లోకి ఏ పెద్ద కేసు వచ్చినా తను వెళ్ళవల్సిందే. అందరికన్నా ప్రాక్టీసు తనకే ఎక్కువ. అయినా తనకు రోజు రోజుకూ మనసులో ఖాళీ పెరుగుతోంది? ఎందుచేత?

ఈ ఇంట్లో ఇలాంటి ఆలోచనలకన్నా, ఏ ఆలోచనలు లేకుండా తుఫాను గాలిలో బయట తిరగడమే సుఖంలా తోచింది. స్పష్టం కాని వేదనలు, వెతుకులాటలు చాలా వున్నాయి. తుఫాను గాలిలో కూలిపోయిన గుడిసె శకలాలను తీసిన విధంగా కాలి కూలిపోయిన గ్రామంలో అమూల్య వస్తువులను వెతికిన విధంగా- తన ముప్పయారు సంవత్సరాల బతుకులోని కావలసిన వాటిని ఒక క్రమ పద్ధతిలో పెట్టడం సాధ్యం కావడం లేదు. అయినా కమురు వాసనల పొగలో అవి శకలాలు శకలాలుగా మనసులో రూపు కడుతూనే వుంటాయి.

ఆ జ్ఞాపకాలను, శకలాలను అందరి లాగా తనూ ఎందుకు దూరం చేయలేడు? ఏ రకమైన ఫీలింగ్ లేకుండా డబ్బు, వస్తువులు, ఆస్తులు కొనడమనే పరుగు పందెంలో ఊపిరి సలపకుండా తనెందుకు లీనంకాలేడు? ఏ నిషా లేకుండా తను బొత్తిగా ఎడారిలా ఎందుకు తయారవుతున్నట్టు? ఇలాంటి ప్రశ్నలనేకం అతని మెదడులో ఉరుముల్లా, మెరుపుల్లా రేగుతున్నాయి.

నాగేంద్రంకు ప్రతి ప్రశ్నకూ ప్రతిసారీ జవాబు కూడా తెలుస్తున్నట్లుగానే వుంటుంది కానీ ఆ జవాబుల్ని తను ఆమోదించలేడు. ఆమోదించడమంటే ద్వంద్వంలో దేన్నో ఒకదాన్ని సమర్థించడమన్నమాట. దేన్నో ఒకదాన్ని సమర్థించడమంటే ఇంకో దాని ఉనికిని తిరస్కరించడమన్నమాట-

ఇంట్లో భార్యా, బయటి మిత్రులూ, చదివిన చదువూ, చేపట్టిన వృత్తీ తనమీద గోబెల్‌లా దాడి చేసి పదే పదే చెప్పుతుంటాయి. "నువ్వు డాక్టరువి! నువ్వు డాక్టరువు కావడానికి నీ నిరంతర శ్రమ, పట్టుదలే కారణం. నీ స్వయం కృషి, స్వంత తెలివి. కనుక నీ కష్టానికి ప్రతిఫలంగా సంపాదించు, విలాసంగా జీవించు, మరింత పేరు ప్రఖ్యాతులు సంపాదించు. నువ్వు ఏ భయంకర పరిస్థితుల నుండి వచ్చావన్నది కాదు. నువ్వు ఎంత సుఖంగా బతుకుతున్నావనేదే ముఖ్యం" ఎన్ని రకాల తిప్పి చెప్పినా సారాంశం ఇదే. పైగా ఈ దరిలో నాగేంద్రం వెనుకబడికూడా లేడు. ప్రాక్టీసు చేయకుండా వుండలేని, సంపాదించకుండా వుండలేని, డబ్బు, వస్తువుల ముట్టడిలో చిక్కుకుపోకుండా వుండలేని, ఊపిరి సలుపని హోదాలో నాగేంద్రం బతుకుతూనే వున్నాడు. ఈ పరుగుపందెం సాంతం తన కృషి ఫలితమేనా? స్వయంకృషి పేర జరిగిన విధ్వంసమా ఇది?

నాగేంద్రంకు రాత్రి నిదుర పట్టదు అతనికి తీయని కలలు రావు, వచ్చే కలలన్నీ పీడకలలే. ఒకసారి ఇసుక తుఫానులో చిక్కుకున్నట్లు, మరొక మారు ఎలుగడిపడిన అడవిలో దిక్కు తోచక పరుగెత్తుతున్నట్టు మెత్తటి పరుపు అంపశయ్యలాగా తోస్తుంది. భార్య సరసన పడుకున్నప్పుడు చెప్పరాని దుర్మార్గమేదో కొండచిలువలాగా చుట్టుకున్నట్లు, రూపాయి నోట్లను కావలించు కున్నట్లు భావనలు.

తన దగ్గరికి వచ్చే రోగుల ముఖాలలో మరీ ముఖ్యంగా కళ్ళలో బీద బీదగా మృత్యువు దోబూచులాడుతూ వుంటే తనకెక్కడో కలుక్కుమంటుంది. తన చిన్నతనం, పల్లె బతుకు, తండ్రి ముఖం చుట్టు ముడతాయి.

ద్వంద్వంలో ఒకటి చదువు- అడుగడుగునా మనిషిని చిన్న చిన్న ముక్కలుగా విడగొట్టే పరీక్షలు. రెండవది బీదతనపు అవశేషాల నుండి స్వచ్ఛ మైన పల్లె జ్ఞాపకాల నుండి వచ్చిన నాగేంద్రం బతుకు. రెండు ఎదురు బొదు రుగా నిలబడి యుద్ధం చేయడం భరించవచ్చు. కానీ.... కానీ ఇవి సమాంత రంగా సాగి సాగి నిరంతరం సంఘర్షించడమే భరింపరానిది.

చదువు- పరీక్షలు పాసవ్వడం ఎప్పుడూ ఫస్టే- స్కాలర్‌షిప్పులతోనే ఎం డి ఫిజీషియన్ పాసయ్యాడు. చదువు కసితో మాత్రమే చదివాడు. బీద తనం మీద కసి- తనకు లేకుండా చాలామందికి వున్న సౌకర్యాల మీద కసి- అయితే బుల్‌ను రెచ్చగొట్టి ఆహ్వానించే ఎర్ర దస్తీలాగా తనను రెచ్చగొట్టి ఆహ్వానించింది. సాలీడు ఈగను తన ఉచ్చులోకి ఆకర్షించినంత నేర్పుగా రెచ్చగొట్టి ఆకర్షించి కొద్దికొద్దిగా మొత్తంగా చదువు తనను చప్పరించింది.... తను డాక్టరయ్యాడు. సంపాదిస్తున్నాడు. కసితోనే పరుగెత్తాడు ఇప్పుడిక్కడ తను దిక్కుతోచని ఒంటరి, మనుషులు వారి సామూహిక సుఖదుఃఖాలు, ప్రేమలు లేని కీకారణ్యంలో చిక్కుకపోయాడు.

తన అందమైన కలల ప్రపంచం ఏది? తనతోపాటు రక్తం పంచుకు పుట్టిన తన వాళ్ళు ఏరి! ఈ సుదీర్ఘ భయంకర ప్రయాణపు మజిలీల్లో తనలాగే వచ్చి చేరిన డాక్టర్లు, ఇంజనీర్లు, జడ్జీలు, లాయర్లు, పోలీసాఫీసర్లు వగైరా వగైరా చాలా మంది తన చుట్టూ వున్నారు. కానీ కన్న తల్లి, అన్నయ్య తమ్ముడు, ఊరు, ఊళ్లోని మనుషులు, చెట్లు, పశులు, గాలి, వాన, ఎండ ఇంకా చాలా లేవు.

నాగేంద్రం ముఖం రుద్దుకున్నాడు. వెచ్చని టీ తాగితే బావుండును. వర్షంలో తడిస్తే బావుండును. అరుస్తూ పరుగెత్తితే- పాట పాడితే కనీసం ఏడవనన్నా ఏడిస్తే తన బరువు దిగిపోవును.

మళ్లీ కల జ్ఞాపకం వచ్చింది. పిల్లవాడి ఏడుపూ బయట కురిసే వర్షంలా, తుఫాను గాలి రొద లాగా విచిత్రమైన, భయంకరమైన, ఇలాంటివేవీ కావి విషాదం కన్నా విషాదంలాగా మారుమోగుతోంది. తనకు పెళ్లైన కొత్తలో- సులోచనా తనూ బెంగుళూరు వెళ్లారు. తాము దిగిన హోటల్ కింద నుండో, వీధిలో నుండో రేడియోలోనో, టేప్ రికార్డర్‌లోనే ఒక పాట వినిపించింది. ఆ పాట కోసం లుంగీతోనే హోటల్ పైఅంతస్తు నుండీ కిందికి పరుగెత్తుకొచ్చాడు. ఫలానా అని చెప్పలేదు గాని ఆ సంగీతం అర్ధరాత్రి అందరూ నిదురపోయి నప్పుడు కుటుంబాన్ని ఒక్కతీ భరించలేక తన తల్లి ఏడ్చినట్లుగానే వున్నది. ఆ పాట తన్ను నిరంతరం వెంటాడుతూనే వున్నది.

నాగేంద్రం పడక కుర్చీలో కూర్చున్నాడు. ఈ ఆలోచనలు ఇట్లాగే కొనసాగితే తనకు పిచ్చెక్కేది ఖాయం. కణతలు రెండు చేతులతో ఒత్తుకుంటూ- వర్షాన్నీ, తుఫానునూ తప్ప ఏదీ వినకూడదనుకున్నాడు. నిద్ర, మెలుకువ కాని స్థితిలో నాగేంద్రం తుఫానును వింటూ కూర్చున్నాడు.

* * * *

దబదబ తలుపు చప్పుడు. ఉలిక్కిపడి లేచాడు నాగేంద్రం. తలుపు తీశాడు.

తెల్లారిపోయింది. వాన వెలిసింది. ఆకాశంలో మబ్బులు ఉరుకులు పరుగుల మీదున్నాయి. ఎదురుగా కాంపౌండర్ గోపాల్.

"నర్సింగ్‌హోం నిండా ఎమర్జెన్సీ రోగులే సార్. రాత్రి తుఫానులో గుడిసెలు కూలి కాళ్లు చేతులు విరిగిన వాళ్లే సార్." గోపాల్ తన కాంపౌండర్ భాషలో చెప్పుకపోతున్నాడు.

నాగేంద్రం బట్టలు వేసుకుని స్కూటర్ బయటకు తీశాడు "గోపాల్ తలుపులు వేసేయి. కిటికీల తలుపులు చూడు. కార్పెంటర్ దగ్గరికి అటెండర్‌ను పంపు"

నాగేంద్రం నర్సింగ్‌హోం ముందు స్కూటర్ ఆపాడు. అప్పటికే చాలా మంది రోగులున్నారు. డాక్టర్లు, నర్సులు హడావుడి పడుతున్నారు. సీదా ఆప

రేషన్ జరిగిన రోగి దగ్గరికి వెళ్ళి 'కేస్‌షీట్' చూశాడు. ఇంకా సెలైను ఎక్కి స్తున్నారు. రోగికి పర్వాలేదు తర్వాత కన్సల్టింగ్ రూంకేసి నడిచాడు ఇద్దరు డాక్టర్లూ రోగులను చూస్తున్నారు.

"ఎనీ ఎమర్జెన్సీ" నాగేంద్రం అడిగాడు.

"అంతా తుఫాను తాకిడే- ఒక పిల్లవాడికి ఎముక ఛాతీలో దిగిపోయింది. సునీల్ ఆపరేషన్ రూంలో వున్నాడు" డాక్టర్ సూర్యారావు.

నాగేంద్రం ఆపరేషన్ థియేటర్ కేసి వెళ్ళబోయాడు.

"హి కెన్ మానేజ్" మళ్ళీ సూర్యారావే.

ఇక్కడ తనకేమీ పని లేదు. "ఒ.కె. నేను టౌన్‌లోని మిగతా నర్సింగ్ హోంలు చూసొస్తాను. వెంకటేశ్వరలో ఒక హార్టు పేషెంట్ సీరియస్‌గా వున్నాడు. ఈ రోజు మీరు మానేజి చేయండి.... ఎనీ ఎమర్జెన్సీ ఐ షల్ కమ్. ఈ రోజు నా కోసం చూడవద్దు" నాగేంద్రం జవాబు వినకుండానే బయటపడ్డాడు.

హార్టు పేషెంటును చూశాడు. నాగేంద్రం కోసమే ఆ పేషెంటు ముగ్గురు కొడుకులూ ఎదురు చూస్తున్నారు. బాగా డబ్బున్న వాళ్ళు, టౌనుకు పది కిలో మీటర్ల దూరంలో భూస్వామి- అతని ఇంటి మీద ఎనిమిది రోజుల క్రితం గిరిజనులు కరువు దాడిచేసి ధాన్యం ఎత్తుకపోయారు. పోలీస్ కేసు. ప్రమాదం దాటింది సరైన సమయానికి ట్రీట్‌మెంట్ అందింది.

"సార్" భూస్వామి పెద్దకొడుకు సారా కాంట్రాక్టరు.

డాక్టరుకు వుండకూడదని చదువులో నేర్చుకున్నదేదో ఎదురు తిరుగుతోంది. "ఎంత మందిని చంపుకతిన్నాడో? చావు దగ్గరికి వచ్చేసరికి విచిత్రం తను, తన సేవలు, చదువుకున్న జ్ఞానం ఇలాంటి వాళ్ళకే ఎక్కువ ఉపయోగపడుతున్నాయి. తను అంత కసిగా చదివింది వీళ్ళకు సేవలు చేయడానికేనా? చాలా గమ్మత్తైన సంగతి.

"సార్ మా బాపుకు ..." ఇంకో కొడుకు.

తన ముఖంలో ఇలాంటి సీడలు బయటి వాళ్ళకు తెలియరాదు.

"సో ప్రమాదం దాటినట్లే. పేషెంటును మాట్లాడనియ్యవద్దు. ముఖ్యంగా రెండు రోజుల దాకా పోలీసులు కనపడకుండా వుంటే మంచిది." అంటూనే నర్సింగ్‌హోం అధిపతి డాక్టర్ రెడ్డికి వీలబడే 'ప్రిస్క్రిప్షన్' రాసి ఇచ్చాడు.

నాగేంద్రం బయటపడేసరికి నంగన్నాచిలా ఎండకాస్తోంది. "బారా, నాగేంద్ర, డాక్టరీ సదువుతున్నవట!" తమ ఊళ్ళో దొర అపహాస్యం చేస్తూ అన్న మాటలు గుర్తొచ్చాయి.

మృత్యు ముఖం నుండి బయటపడిన రోగి ముఖం లాగున్నది ఆకాశం. ఎడతెరిపి లేని ముసురులో ఆకలితో మగ్గిపోయి- ఉరిసిన గుడిసెలో వనుకుబట్టి- ఒక్కసారి ఎండను చూసి పిచ్చెత్తి పరుగులు పెట్టిన బరిబాత పిల్లలు జ్ఞాపకం వచ్చారు. ఆ పిల్లల్లో తను వున్నాడు. బొబ్బలు కొట్టే వాగు, మురికి నీటి ప్రవాహంలో కొట్టుక వచ్చే అడవిలోని కర్ర దుంగలు- వాటి కోసం పోటీలు పడి ఈదులాడే మనుషులు జ్ఞాపకం వచ్చారు.

ఆ జ్ఞాపకాలను పొడిగించే ఇష్టం లేక, సాహసం లేక స్కూటర్ స్టార్టు చేశాడు. హైవే మీద కొంత దూరం పోయేసరికి రోడ్డుకు ఆ పక్క, ఈ పక్కన గల పచ్చిరిక చెట్లు వేళ్ళతో సహా పెకలించబడి రోడ్డుకడ్డంగా పడి వున్నాయి. బారులు తీరి లారీలు ఆగిపోయి వున్నాయి. డ్రైవర్లు, క్లీనర్లు ఆ చెట్ల చుట్టు కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతున్నారు.

ఎటు చూస్తే అటు నీళ్లు తెల్లగా ఇంకా పారుతూనే వున్నాయి.

స్కూటర్ వెనక్కు తిప్పుకుని సందుల గుండా ఇస్లాంపురా వెళ్లాడు. అక్కడ ఏడుపులు సుళ్లు తిరుగుతున్నాయి. అట్టలతో, రేకులతో కట్టిన చాలా గుడిసెలు కూలిపోయి అక్కడ బుల్‌డోజర్ తొక్కినట్లుగా అయిపోయింది.

"యా అల్లా! పూరా సత్తెనాశ్ హోగయా!" స్త్రీలు ఏడుస్తూ కూలిన గుడిసెల మరమ్మత్తుల్లో పడిపోయారు. సాయెబులు మురికి లాగులు తడిసి తపా తపా కొట్టుకుంటుండగా దిక్కు తోచక అక్కడికక్కడికి తిరుగుతున్నారు.

నాగేంద్రంను దాదాపు అందరూ గుర్తుపట్టి చుట్టు మూగారు.

"దేఖోసాబ్! హమారా పాస్ కోయినయి ఆయా! హిందూ మొహల్లే మే సానామంది సాయం చేస్తుండ్లు. ఇక్కడికి ఎవలు ... ఏమనుకున్నదో ఏమో- అతను చెప్పేది విన్పించకుండా అతని చంకలోగల నల్లటి అమ్మాయి ఆకలికి తాళలేక ఏడుస్తోంది. "ఆప్ దేఖోసాబ్ ఇన్సాబ్ (న్యాయం మీరే చూడండి)" ఆఖరి మాట అనేశాడు.

ఎటు చూసినా మురికి పిల్లలే. వారి ఏడుపులు, బురద, తొక్కిసలాట. వీళ్ళ బతుకు ఛిన్నాభిన్నం కావడానికి పెద్ద వర్షం చాలు. ఆ ఏడుపులు తనను చుట్టుముడుతున్నాయి. అక్కడ తను ఒక్కడూ చేయగలిగిందేమీ లేదు. అనంతమైన దరిద్రం సహాయాలకు లొంగేది కాదు.

"ఏదైనా ఇంతెజాం చేయాలి. కనీసం ఈ పూట తిండైనా" అనుకుంటూ అక్కడి నుండి బయలుదేరాడు.

దారిలోనే స్పిన్నింగ్ మిల్ కాలనీ.

అక్కడ యమ సందడిగా వున్నది చాలా మంది వలంటీర్లు తమ తమ సంస్థ బ్యాడ్జీలు ధరించి వున్నారు. తెలుగుదేశం, కాంగ్రెస్, కమ్యూనిస్టు, జనతా పార్టి లాంటి రాజకీయ పార్టీలూ వాటి అనుబంధ సంస్థలూ రంగంలో వున్నాయి. ఎవరి గ్రూపు నాయకులు వారికే పనులు పురమాయిస్తున్నారు. లారీలు వచ్చి నిలుచున్నాయి. స్త్రీలూ, పిల్లలూ, ముసలీ ముతకనూ స్కూళ్ళు, సత్రాలల్లోకి తరలిస్తున్నారు.

నాయకులు నాగేంద్రంను గుర్తుపట్టారు

"ఇస్లాంపురాలో ఇంకా భారీ నష్టం జరిగింది. అక్కడి పరిస్థితి ఘోరంగా వున్నది. అక్కడ ఒక్క కార్యకర్త కూడా లేడు" నాగేంద్రం మాట పూర్తి కాకుండానే.

"అంత మందివి పోటీ మీద ఎందుకు కన్నాలెసార్" అన్నారెవరో?

ఒక చోటా లీడరు ఈ గొడవేం పట్టకుండా దిక్కులు చూస్తున్నాడు. ఆతనికి ఈ సహాయ కార్యక్రమాలకన్నా విలేకరుల మీదే వున్నది కన్ను. తన మనుషులను ఫోటోగ్రాఫర్ల కోసం పంపాడు కూడా.

అక్కడా తను చేసేదేమీ లేదు తను అక్కడి ఏదో పార్టికి చెందకుండా ఏది చెయ్యనియ్యరని తేలిపోయింది.

నాగేంద్రం అక్కడి నుండి తమ క్లబ్బు ప్రెసిడెంటు ఇంటికేసి స్కూటరు పరుగెత్తించాడు.

ఒక అందమైన ఆధునాతనమైన బిల్డింగు ముందు స్కూటర్ ఆపి హారన్ మోగించాడు హారన్ విని నౌఖరు పరుగెత్తుకొచ్చి గేటు తీశాడు.

పాల మీగడలా తెల్లగా వున్న పామెరిన్ జాతి బొచ్చుకుక్క పరుగెత్తుకొచ్చి నాగేంద్రం కాళ్ళు నాకింది. దాని వీపుమీద ప్రేమగా రాసి ఇంటి ముందు గల గార్డెన్‌లోకి అడుగు పెట్టాడు.

పూలతోట గాలి వానకు చిందర వందర అయినందుకు ఎర్రగా, బొద్దుగా వున్న ఆ ఇంటి ఇల్లాలు నౌఖర్ల మీద చిరాకు పడుతూ కన్పించింది.

నాగేంద్రంను చూడగానే చిరునవ్వు పులుముకొని "రండి అన్నయ్యగారూ" అని ఇంట్లోకి వెళ్ళిపోయింది.

నాగేంద్రం వరండాలో గల కేన్ కుర్చీలో కూర్చుండి వరండా రెయిల్సుకు అల్లుక పోయిన మనీ ప్లాంటు ఆకుల మీద మెరిసే నీటి బిందువులు చూస్తున్నాడు.

కాసేపటికి ఆవులిస్తూ నిద్ర మొహంతో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శాస్త్రి వచ్చాడు. నాగేంద్రం పక్క తనోకేన్ కుర్చీలో కూలబడి "నిన్నటి దాక 'చీఫ్' టూర్, వేపుక తిన్నాడనుకో" అంటుండగానే పది సంవత్సరాల వయసు గల పనిపిల్ల ఇద్దరికీ కాఫీ తీసుకు వచ్చింది.

ఆ ఇంటి అహ్లాదకరమైన వాతావరణం, పచ్చగా ఏపుగా పెరిగిన పూల తోట, దర్జాగా కేన్ కుర్చీలో కూర్చున్న బొచ్చుకుక్క, ఇంటావిడ పచ్చటి ముఖం, మనీ ప్లాంటు పచ్చదనం అన్నీ కలిసి ఇక్కడ బురదా, రొచ్చూ, కూలిన గుడిసెలూ, ఏడుపులూ పెడబొబ్బల ప్రస్తావన తేవద్దని చెప్పకనే చెప్పుతున్నట్లున్నాయి.

"రాత్రి ఏం తుఫాను. నా జన్మలో ఇలాంటి తుఫాను చూల్లేదు. డాక్టర్! మీరు పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన' కథ చదివారా? మార్వలెస్ స్టోరీ. మొత్తం జలమయమై పోగలదేమోననిపించింది డాక్టర్!" శాస్త్రి కాఫీ కప్పు కింద పెడుతూ అన్నాడు.

శాస్త్రికి దేనినీ వర్ణించే భాష లేదు. అతను ఆఫీసు భాషలో తప్ప ఇత రత్రా నాలుగు మాటలు మాట్లాడలేదు.

నాగేంద్రంకు 'గాలివాన' కథ జ్ఞాపకం వచ్చింది. ఆ కథ మీద నాగేం ద్రంకు అనేక సందేహాలున్నాయి. ముఖ్యంగా బీభత్సంలో రొమాన్సు, క్వయిట్ అన్నాచురల్- ఎనీ హౌ ఊళ్ళో రాత్రి సంభవించిన తుఫాను బీభత్సం గురించి శాస్త్రికి చెప్పాలనుకున్నాడు.

శాస్త్రి సిగరెట్టు ముట్టించి నోటిలో నుంచి పొగలు కక్కుతూ "డాక్టర్ నువ్వు కారెప్పుడు కొంటావ్? ఎంబాసిడర్, ఫియట్ ఓల్డు ప్యాషన్- నొవేడేస్ మారుతి ఈజ్ సూపర్బ్" తుఫానుతో తనుకేమిటి పనన్నట్లుగా అన్నాడు.

"శాస్త్రిగారూ రాత్రి తుఫానుకు మన టౌన్‌లో ఫిఫ్టీ పర్సెంటు గుడిసెలు కుప్ప కూలిపోయినయ్. అన్ని రకాల పార్టీల వాళ్ళు తమకు తోచిన సహాయం చేస్తున్నారు తిండిలేక నిర్వాసితులు గగ్గోలైపోతున్నారు. మన క్లబ్బు తరఫున నిర్వాసితులకు భోజనం ఏర్పాట్లు చేస్తే ఎట్లా వుంటుంది?" నాగేంద్రం అర్థాం తరంగా తటుకులేసినట్లుగా చెప్పుకొచ్చాడు.

శాస్త్రి బొచ్చుకుక్కను చేతుల్లోకి తీసుకొని "యూనో డాక్టర్ అవర్ క్లబ్ ఈజ్ ప్యూర్‌లీ నాన్ పొలిటికల్- మున్సిపాలిటీ వున్నది. ఓట్ల కోసం దెంపర్లాడే పొలిటికల్ పార్టీలున్నాయి. మనకు అంత పెద్ద పని సాధ్యం కాగ లదా? డబ్బు ప్రాబ్లమ్ కాదు. మనకు కార్యకర్తలు ఏరీ? మనం డబ్బు ఇచ్చా

మనుకోండి. పేరు ఇతర ఆర్గనైజేషన్స్‌కు పోతుంది. అయినా ఐ క్యాంపులూ, డెంటల్ క్యాంపులంటే మనం మానేజు చేయవచ్చు" అన్నాడు.

"అంతకన్నా ఇది ముఖ్యం కాదా?" నాగేంద్రం క్లబ్బుకు వైస్ ప్రెసిడెంటు అయినా ఓటమి గొంతుతో

"ఓకే- హఠాత్తుగా జరిగింది. మనిద్దరమే డెసిషన్ తీసుకోలేము కదా! పైగా బిగ్‌జాబ్- కనీసం బాడీనన్నా పిలవాలి" శాస్త్రి.

"కానీ ఈ సమయంలో మనం కూడా ఏదైనా చేయకపోతే బావుండదు శాస్త్రి సాబ్ ఎనీహా ఇది నా వ్యక్తిగత అభిప్రాయం"

"ఓకే ఐ విల్ ట్రై" శాస్త్రి

నాగేంద్రం ఇంక అక్కడ చేసేదేమీ లేక బయటపడ్డాడు.

'తను డాక్టర్ కనుక తనతో పని కావలనే తనకు వైస్ ప్రెసిడెంటు పదవి ఇచ్చారనిపించింది. బీద ప్రజానీకం లన పేషెంట్లు కాకపోతే ఈ ప్రపోజల్ శాస్త్రి పెట్టేవాడు చదువులు నేర్పిన తెలివితేటలు కదా" అనుకున్నాడు నాగేంద్రం.

* * *

రెండు రోజులు డాక్టర్ నాగేంద్రం తుఫాను బాధితులతోనే గడిపాడు స్కూళ్ళల్లో చేర్చిన వారికి భోజన సదుపాయాలు చేశాడు. వర్షంలో తడిసి తుఫానులో గాయపడ్డ వారికి మరో ఇద్దరు ఎం.బి.బి ఎస్ డాక్టర్లను వెంటేసుకొని చికిత్సలు చేశాడు.

అయినా నాగేంద్రం మనసులో తుఫాను చల్లారలేదు. తన మనసులోని తుఫాను స్వరూప స్వభావాలేమిటో స్పష్టంగా తెలియడంలేదు అన్ని జబ్బులకు కారణాలు, మందులు తెలిసిన నాగేంద్రంకు తన మానసిక ఆందోళనకు కారణాలూ, మందూ తెలియవు ప్రశ్నలు లేకుండా ప్రపంచం ఎట్లా పడి తిరిగితే అట్లా పడి తిరిగి పోవాలని, అందిన కాడికి స్వంతం చేసుకోవాలని దైనందిన జీవితం, వృత్తి శాసిస్తాయి. కాని మనసు అందుకు సిద్ధం కాదు ఈ ద్వంద్వం తను డాక్టర్ కోర్సులో చేరిన దగ్గిరి నుండి పెరుగుతూ వచ్చిందే కాని తరుగ లేదు ఈ తుఫాను తగ్గేదెప్పుడో తెలియడం లేదు.

తన స్వంత క్లినిక్‌లో కూర్చుండి ఇలాంటి ఆలోచనలు చేస్తున్న నాగేంద్రం క్లినిక్ ముందు మారుతికారు ఆగింది.

ఓక్టోన్ స్పెషలిస్టు నందకుమార్ ఆదరబాదరగా "డాక్టర్ సాబ్ మీరింకా ఇక్కడే వున్నారా? టౌన్‌హాల్లో మీటింగ్ మంత్రిగారు వచ్చారు. మీరు మన క్లబ్బు తరపున మాట్లాడాలని మరిచి పోయారా?" అన్నాడు.

"నేనా దేన్ని గురించి?" నాగేంద్రం కుర్చీలో నుండి లేస్తూ అడిగాడు.

"అదంతా దారిలో మాట్లాడుకుందాం ముందు కారెక్కు" తొందర చేశాడు నందకుమార్. నాగేంద్రం క్లినిక్‌లో పేషెంట్లు లేరు. అయిష్టంగానే కారెక్కాడు.

"తుఫాను తాకిడికి మన టౌను సగం అతలాకుతలం అయ్యింది. ఆస్తి నష్టం అట్లా వుంచు. ఆరుగురు చనిపోయారు రెండు రోజుల నుండి సుప్పా అవన్నీ చూస్తున్నావు. నిర్వాసితులకు ఏదన్నా సహాయం అందేలా సిఫార్సు చేయాలి" నందకుమార్

నాగేంద్రంకు ఆశ్చర్యంగా వున్నది మొన్న వీళ్ళందరి చుట్టూ తను తిరిగాడు. ఎవరూ ముందుకు రాలేదు మంత్రి రాకతో వీళ్ళే హడావిడి పడుతున్నారు. గవర్నమెంటు కన్నీటి తుడుపుగా ఏమన్నా చేస్తుందో లేదో తెలియదు. ఆ చేసేది తమ అభ్యర్థన మేరకే చేసినట్లుగా వీళ్ళకు పేరు కావాలి. అభ్యర్థన తను చేయాలి.

నాగేంద్రంకు ఊళ్ళో దొర జ్ఞాపకం వచ్చాడు. దొర గ్రామాన్ని అందిన కాడికి దోచేసి ఏడాదికో మారు పురాణం చెప్పించి గుళ్ళో పూజలు చేసేవాడు. ఆ దెబ్బతో దొర పుణ్యాత్ముడు. ఊళ్ళో దొరకాళ్ళ కింద నలిగి పోయిన వాళ్ళు దొర ధర్మ బుద్ధికీ, అన్న సంతర్పణకూ పొంగి పోతారు. అధికార్లూ, డాక్టర్లూ తమకు అందిన మేరకు ప్రజల నుండి పిండుకొని కష్ట కాలంలో ఆదుకున్న పేరుతో బతికేస్తారు.

నందకుమార్ ఇంకా ఏదో చెప్పుతున్నాడు మంత్రిగారికి స్వాగత తోరణాలు దారి పొడుగునా కట్టారు రోడ్డుకు ఆ పక్క ఈ పక్క అలిసి పోయిన ముఖాలతో పోలీసులు నిలుచున్నారు.

కారు టౌనుహాలు చేరుకునే సరికి టౌను పెద్దలూ, వ్యాపారస్తులూ, అన్ని రకాల అధికారులూ, పార్టీ కార్యకర్తలూ హడావిడి పడుతున్నారు

తమ క్లబ్బు ప్రెసిడెంటు శాస్త్రి ఎదురొచ్చి "ఇంతాలస్యమా" అన్నాడు.

మంత్రి ఇంకా రాలేదు. మంత్రి సహాయక శిబిరాలను సందర్శించి వస్తున్నారట

నందకుమార్, నాగేంద్రం వేదిక ముందు భాగంలో గల వి.ఐ.పి. సీట్లలో కూర్చున్నారు.

మరో అరగంట తరువాత మంత్రిగారు మందీ మార్బలంతో వచ్చారు. ఆయన వెంట కలెక్టరూ, ఎస్ పీ. వచ్చారు.

వేదిక మీద మునిసిపల్ ఛైర్మన్, పట్టణ పార్టీ అధ్యక్షుడూ, వర్తక సంఘం అధ్యక్షుడూ వగైరా చాలా మంది కూర్చున్నారు.

అందులో ఒకరు బొంగురు గొంతుతో మంత్రిగారికి స్వాగత వచనాలు పలికారు

మంత్రి చేతులు జోడించి అలవాటుగా చిరునవ్వు నవ్వి వేదిక మీదికి ఎక్కారు.

మంత్రిగారిని అన్ని సంఘాల వాళ్ళూ పోటీపడి పూలమాలలతో ముంచెత్తారు. మంత్రిగారికి సన్మానం జరుగుతున్నదో? తుఫాను నిర్వాసితుల పరామర్శ జరుగుతున్నదో నాగేంద్రంకు అర్థం కాలేదు.

హాలంతా కలియ చూశాడు. ఆ సభలో మురికి బట్టలవాళ్ళు, తుఫాను బాధితులు ఒక్కరన్నా లేరు. అందరూ అంతో ఇంతో చదువుకున్న వాళ్ళలాగే కనిపిస్తున్నారు.

మీటింగు ఆరంభమయ్యింది. ఎమ్మెల్యే మంత్రిగారిని తను నేర్చుకున్న భాషలో పొగిడాడు. మంత్రిగారు బీద కుటుంబం నుండి వచ్చినట్లుగా గుర్తు చేశాడు.

మంత్రి హరిజనుడని చెప్పకనే చెప్పాడు. చదువు ద్వారా నేర్చుకున్న భాష ఎంత దగుల్బాజీ భాషో నాగేంద్రంకు అర్థమయ్యింది

మంత్రి కింకా నలభై సంవత్సరాలు నిండలేదు. ఇంకా మంత్రి పదవికి అలవాటుపడినట్లుగా లేదు ఆ పొగడ్తలకే మంత్రి ముఖంలో దరహాసం.

ఆ తరువాత మునిసిపల్ ఛైర్మన్ తన సుదీర్ఘ ప్రసంగంలో తన కులం వాళ్ళు నివసించే ప్రాంతాలల్లో తుఫాను తాకిడి గురించి చెప్పుకొచ్చాడు.

నాగేంద్రం పక్కనే కూర్చున్న నందకుమార్ "మీట్ అవర్ ఎస్.పి" అన్నాడు హఠాత్తుగా.

నాగేంద్రంకు ఎడమ పక్కన సివిల్ డ్రెస్సులో గల ముప్పయి రెండు సంవత్సరాల యువకున్ని చూపిస్తూ "హీఈజ్ అవర్ కొలీగ్ మిస్టర్ నాగేంద్ర ఎం.డి ఫిజిషియన్" నందకుమార్.

నాగేంద్రం ఎస్.పి.తో చేయి కలిపాడు.

"ఐసీ" ఎస్.పి. పోలీసు నవ్వుతో.

"థాంక్యూ సర్" నాగేంద్రం.

ఉపన్యాసాలు జోరుగా సాగుతున్నాయి.

ఉపన్యాసంలో ఒకరినొకరు పొగుడుకుంటున్నారు. పొడిమాటలు. ఒకరి నొకరు మోసం చేసుకోవడానికి విఫల ప్రయత్నాలు- ఆ మాటల్లో తుఫాను వారికి దొరికిన ఒక మంచి అవకాశంగా నాగేంద్రంకు తోస్తున్నది. తుఫాను బీభత్సం గురించి రవ్వంత ఆర్తి ఆ మాటల్లో లేదు. ఎవరి కక్కుర్తి వాళ్ళదే.

తుఫాను బీభత్సంలో గుడిసెలు కూలి గొడ్లలాగా నిర్వాసితుల క్యాంపుల్లో రోదిస్తున్న దురదృష్టవంతుల ఏడుపు ఇక్కడి వాళ్ళకెవరికీ పట్టదు! వీళ్ళు, చదువు మాయాజాలంలో తప్పిపోయిన వాళ్ళు.

"ఇంత మంది చదువుకున్న వాళ్ళు?" నాగేంద్రంకు ఏదో స్పష్టమైనట్లనిపించింది వీరందరి మాటలూ, సంస్కారం ఒక్కటే. సారూప్యం ఎక్కడ? ముక్కముక్కలుగా తెగిపోయి- పోటీ ప్రపంచంలో ఎవరికి అందినది వారు ఒడుపుతో చేజిక్కించుకోవడమే అద్భుతమైన, శక్తివంతమైన మాటల్లో చెప్పలేనిగాని సామూహిక మానవ సంఘ జీవితం నుండి వీళ్ళంతా ఎందుకిట్లా స్వార్థపరులుగా ఒకొక్కరుగా- ఒక్కరు మళ్ళీ అనేక చిన్న చిన్న ముక్కలుగా విడిపోయారు? ఇంత పకడ్బందీగా వీరికి శిక్షణ ఇచ్చిన శక్తేది? వన దగ్గరికి చుట్టు పక్కల గ్రామాల నుండి రైతులూ, ఘాట్ల నుండి గిరిజనులూ వస్తారు. అక్కడ ఎవరికన్నా ప్రమాదం జరిగితే గ్రామం, ఘాట్ యావత్తు తల్లడిల్లిపోతుంది. ఇక్కడ ఒకడి కాళ్ళ కింద భూమి మరొకడు తొలిచే కుయుక్తి ఎట్లా వచ్చింది?

ఉపన్యాసాలు నడుస్తున్నాయి. నాగేంద్రం అప్పుడే మనుషులను చూస్తున్నట్లుగా తనకు కన్పించిన ముఖాన్నల్లా పరిశీలనగా చూశాడు.

మైకులో "ఫలానా క్లబ్బు తరపున డాక్టర్ నాగేంద్రం మాట్లాడతాడు" అని విన్పించింది.

నాగేంద్రం వేదిక ఎక్కుతుంటే తుఫాను రాత్రి వచ్చిన కల. తల్లి, తమ్ముడు, ఆక్సిడెంట్లో చనిపోయిన అన్నయ్య, కుటుంబం గడపక ప్రైవేటు స్కూల్లో టీచర్ పని చేస్తున్న వదిన- పెళ్ళీడు కొచ్చిన అన్నయ్య కూతురూ- జ్ఞాపకం వచ్చారు. మైకు ముందు నిలబడినప్పుడు జొన్నచేళ్ళల్లో దగ్గర పాము కరిచి నురుగులు కక్కుతూ చనిపోయిన తండ్రి ముఖం అస్పష్టంగా మెదిలింది.

రెండు నిమిషాలు పూర్తిగా మాటలు మరిచిపోయిన వానిలాగా అసలు మాటలేమీ నేర్చుకోని వానిలాగా నిలుచున్నాడు.

సభలో అలజడి కొద్దిగా - నాగేంద్రం వెనుక కుర్చీలో కూర్చున్న మునిసిపల్ ఛైర్మన్ "డాక్టర్ సాబ్!" అన్నాడు గుసగుసగా.

నాగేంద్రం ఉలిక్కిపడి అప్పుడే అక్కడికి పరుగెత్తుకొచ్చిన వానిలాగా అందరి ముఖాలూ చూసి-

"గౌరవనీయులైన మంత్రిగారికీ, పెద్దలు, పుర ప్రముఖులు, అధికారులూ అందరికీ నా వందనాలు. ఈ సభ తుఫాను బాధితుల గురించి మంత్రిగారి పరామర్శ సందర్భంలో ఏర్పాటు చేసుకున్నాం. మొన్న రాత్రి సంభవించిన ఘోరమైన తుఫానులో మన పట్టణంలో దాదాపు సగభాగం దెబ్బతిన్నది. వేలాది మంది దిక్కుతోచక పాఠశాలల్లో నిర్వాసితులుగా వున్నారు. నిర్వాసితులకు అందవల్సిన సహాయం గురించి అధికారులూ, పురప్రముఖులూ ఇక్కడ ఇంతదాకా తర్జన భర్జన పడుతున్నట్లుగా నాకు అర్థమయ్యింది

నిర్వాసితులకు ఏం కావాలో మనం నిర్ణయించడానికి ఇక్కడ సమావేశమయ్యాం. గమ్మత్తేమిటంటే తుఫాను బాధితులు తమకేం సహాయం కావాలో పెద్దలకు చెప్పుకోవడానికి ఒక్కరైనా ఈ సభకు వచ్చారేమోనని సభంతా కలియ చూశాను. కానీ వాళ్ళు ఇంతదాకా రాగలిగిన స్థితిలో లేరనుకుంటాను.

ప్రజలు తుపానులకూ, దరిద్రానికీ చిక్కే ప్రజలు- మనకు పాలూ పెరుగుతో ఆరోగ్యం, తెలివితేటల చదువూ, ఓట్లతో మంత్రిగారికి మంత్రి పదవీ, నాబోటి వానికి డాక్టరు వృత్తి ఇప్పించి తాము మాత్రం నిత్యం దరిద్రంలో మగ్గిపోయే పేద ప్రజలు- ఇక్కడ కూర్చున్న వాళ్ళందరం మన దేశంలోని ప్రజల తరపున చదువుకొని జ్ఞానవంతులమయ్యాం ప్రతిఫలంగా మన జ్ఞానంతో వాళ్ళ కష్టసుఖాలు చూస్తారనుకున్నారు" ఈ మాటతో నాగేంద్రం కంఠం వణికింది. తల్లి జ్ఞాపకం వచ్చింది చిత్రంగా వేన వేల మాటలు పోటెత్తుతున్నాయి. డాక్టర్ సంస్కారం గొంతు నొక్కుతోంది.

"టౌను సగం శిథిలమయ్యింది. అధికారులూ- మంత్రిగారూ చూసి వచ్చారు మనం మన గొప్ప పనుల్లో- బాధ్యత గలిగిన బతుకుల్లో తల మునకలై వున్నాం. నిజమే! కనీసం తుపాను బాధితులు కోలుకోవడానికి మన వంతు బాధ్యతగా కాకున్నా సహాయంగానైనా ఎంతో కొంత చేయాలని నేను అనుకుంటున్నాను నాకీ అవకాశం కల్గించిన పెద్దలకు మరో మారు నమస్కారాలు తెలుపుకుంటున్నాను"

నాగేంద్రం వేదిక దిగి వచ్చి తన స్థానంలో కూర్చున్నాడు.

అక్కడ కూర్చున్న చాలా మందికి అర్థం అయ్యిందో? అర్థమైనా పట్టిం చుకోకూడదనో, మొత్తానికి ఎవరూ ప్రతిస్పందించలేదు.

మరో నాయకుడు తన సహజ ధోరణిలో మాట్లాడాడు.

టౌన్‌హాల్ బయట వర్షం ఒక్కపెట్టున వచ్చింది. బయట నిలబడిన వాళ్ళు హాల్లోకి తోసుక వచ్చారు.

పక్క సీట్లో ఎస్.పి లేచి వెళ్ళాడు.

ఆ ఉపన్యాసాలు నాగేంద్రం భరించలేకపోయాడు. ఎట్లాగో సందు చూసు కొని బయట పడ్డాడు.

వరండాలో ఎస్.పి. అడిషనల్ ఎస్.పి తో, ఇద్దరు డియస్పీలతో ఏదో మాట్లాడుతున్నాడు. వర్షం కురుస్తోంది.

డియస్పీలిద్దరూ కింది కులం నుండి ఠక్కామొక్కీలు తిని పైకి వచ్చిన వాళ్ళలాగా వున్నారు

కొంచెం వయసు మళ్ళిన డియస్పీ "చదువుకున్న వాళ్ళంతా ప్రజలకు ద్రోహం చేస్తున్నారని డాక్టర్ సాబ్ కోప్పడ్డారు" అని ఇంగ్లీషులో ఎస్.పి.కి చెప్పాడు.

"ఐ సీ. ఆసక్తిగా వుందే" ఎస్.పి. ఇంగ్లీషులోనే.

"ఇది నా అనుభవం సార్ - ఎవరివి నేను వేలెత్తి చూపలేదు సార్" నాగేంద్రం.

"నిజమే. కానీ మీ పరిశీలన కొత్తగా వున్నది" అడిషనల్ ఎస్.పి.

"ప్రజల డాక్టరు కదా!" ఆ టౌను డియస్పీ.

"ఓ ఐసీ...." ఎస్.పి.

నాగేంద్రంకు వాళ్ళ మనసులో గల భావం అర్థమయ్యింది. ఎస్.పి.కి అర్థం కాదు. కాని డియస్పీలు కింది నుండి వచ్చిన వాళ్ళు- 'బీదతనపు తల్లి పేగు సంబంధం తెంచుకొని వచ్చిన వాళ్ళు - వాళ్ళ బంధువులకూ తల్లి దండ్రు లకూ వ్యతిరేకంగా పాలితుల తరపున అధికారులుగా మారే క్రమం ఎక్కడు న్నది? ఇది ఒక క్రమ పద్ధతిలో జరిగిన తెంతేనా?

వాన తగ్గింది తుంపర పడుతున్నది. పోలీసు అధికారులు లోపలికి నడిచారు. నాగేంద్రం తుంపరలో తడుస్తూ బయటకు నడిచాడు.

* * *

ఉదయం పదకొండు గంటలయ్యింది నలుగురు కొడుకులూ, ఒక కూతు రుండి కూడా ఒక్కత్తె డయాబెటిస్ పేషెంటు వచ్చింది. పాత పేషెంటే.

ఆమెకు రోగ తీవ్రత కన్నా తన కన్న కొడుకులు తనను పట్టించుకోవడం లేదనే బాధ ఎక్కువ.

ఆ మాట చెప్పుకోవడానికి ఆమెకు మనిషి లేదు. బాగా ధనవంతులు. గొణుగుతుంది తనలో తానే.

నాగేంద్రం యాంత్రికంగా మాట్లాడుతూ మందులు రాస్తున్నాడు.

"డాక్టర్ సాబ్ మీకు అమ్మ వున్నదా?" పేషెంటు.

నాగేంద్రం పేషెంటు ముఖంలోకి చూశాడు ఆవిడ కళ్ళనిండా నీళ్ళు.

"ఉందమ్మా " నాగేంద్రం.

ఆమె మాట్లాడకుండా లేచి వెళ్ళిపోయింది ఆమెకు ప్రేమ కావాలి. మందుల కాగితం కాంపౌండర్ కిచ్చి పంపాడు.

గడియారం చూసుకున్నాడు పదకొండూ అయిదు నిమిషాలు. నర్సింగ్ హోంకు ఒక రౌండు వెళ్ళాలి నర్సింగ్‌హోం నలుగురు కలిసి పెట్టారు. సర్జన్ వర్కింగ్ పార్టనర్ మిగతా ముగ్గురికీ వారివారి స్వంత క్లినిక్‌లున్నాయి.

లేద్దామనుకునేసరికే ఫోను మోగింది.

"హలో జడ్జి శంకర్రావును మాట్లాడుతున్నా. మొన్న - అదే వారం రోజుల క్రితం టౌన్‌హాల్లో మీటింగు జరిగిందికదా! కాంట్రవర్సియల్‌గా మాట్లాడారు. డాక్టర్ మీరనుకున్నట్టు ప్రజలు తెలివి తక్కువ వాళ్ళు కాదు. చాలా తెలివైన వాళ్ళు" జడ్జిగారు తన భాషలో చెప్పుతున్నారు.

అతనికి ఉద్యమాలంటే కోపం - ప్రతి ఉద్యమాన్నీ కూడా ఉన్నత కులాల సృష్టి అంటాడు. ఉన్నత కులాలవాళ్ళు లేవనెత్తి హరిజనులను బలి పశువులను చేస్తారంటాడు. ఏయే ఉద్యమంలో ఎంతెంత మంది హరిజనులు చనిపోయారో లెక్కలు చెప్తాడు. ప్రజలంటే అతని భాషలో పై కులాల వాళ్ళు.

"నేను సిన్సియర్‌గా ఫీలయ్యింది చెప్పాను సార్"

"ఉత్త అబద్ధం. మొన్నటి తుఫానులో హరిజన వాడను ఏ పొలిటికల్ పార్టి, గవర్నమెంటూ కూడా పట్టించుకోలేదు యూనో" అది జడ్జిగారు చెప్పదలుచుకున్న పాయింటు.

"అసలు ఎవరిని కూడా పట్టించుకోలేదు సార్" నాగేంద్రం శాంతంగా.

"అబద్ధం హిందువులను హిందువులూ, ముస్లింలను ముస్లింలూ" జడ్జిగారు వాదనలోకి దిగారు.

పోనీ హరిజనుల బతుకులు బాగుపడాలంటే ఏమి చేయాలి? అనే మాట అడుగక ముందే జడ్జిగారు చెప్పుకొస్తారు.

"హరిజనులు చదువుకోవాలి చైతన్యం పొందాలి"- ఇదే ధోరణి.

హరిజనుడైన జడ్జిగారు హరిజనులకు చేస్తున్నదేమిటి? ఎవరి తరపున ఎవరికి శిక్షలు ఏ కారణంగా వేస్తున్నాడు?

తను రైతు కుటుంబం నుండి వచ్చిన వాడే- తను డాక్టరుగా ఎవరికి సేవలు చేస్తున్నాడు? తను తీసుకునే ఫీజు - రాసే మందులు ఎవరికి అందుబాటులో ఉన్నాయి? తనెక్కడ ప్రాక్టీసు పెట్టాడు?

నాగేంద్రం ఇట్లా ఆలోచిస్తుండగానే జడ్జిగారు తన గ్యాసు ట్రబుల్ గురించి చెప్పి ఫోను పెట్టేశాడు.

మనసంతా అతలాకుతలం అయ్యింది. నర్సింగ్‌హోంకు పోదామనుకున్నాడు కానీ లేవలేదు. వారం రోజుల్లో శారీరకంగానే కాక మానసికంగా కూడా బాగా అలసిపోయాడు.

తను కసితో చదివాడు. ఎవరి మీద కసితో? పల్లెలో చదువుకుంటున్నప్పుడు తన మురికి గుడ్డల మీద కసి- తనకన్నా మంచి గుడ్డలు కట్టినవాళ్ళ మీద కసి- తండ్రి ఉన్నవారి మీద కసి- దొరల మీద కసి- దొరల పిల్లల మీద కసి - ఆ కసిలో పరీక్షలు పాసయ్యాడు. స్కాలర్‌షిప్పుతో చదివాడు. తను తన క్లాసు విద్యార్థులకన్నా ఎక్కువ చదవాలి. తండ్రి గల పిల్లలకన్నా ఎక్కువ చదవాలి. ఒక్కొక్క మెట్టే ఎక్కుతున్నకొద్దీ తనలో పట్టుదల పెరిగింది. ఎన్నో ఎదురు దెబ్బలు తిన్నాడు ఒక్కొక్క ఎదురు దెబ్బ తనను రెచ్చగొట్టింది. తనిప్పుడు హోదా పొందగలిగాడు ఒకప్పుడు ఈ టౌనులో ప్రాక్టీసు పెట్టినప్పుడు చింకిచాపా, అర్థాకలి! ఎవరు పిలిస్తే వారి వద్దకు వెళ్ళి వైద్యం చేశాడు ఇప్పుడు తనకన్నీ ఉన్నాయి. కాని దేనికోసమైతే పరుగెత్తాడో అది ఒక గాజు భవనం లాగా తోస్తున్నది. అనురానూ తనకు తక్కువమంది దగ్గరైతే ఎక్కువ మంది దూరమవుతున్నట్టుగా తోస్తున్నది.

ఒక యాభయ్యేండ్ల ముస్లిం పేషెంటు దగ్గుతూ వచ్చాడు. అతను తనతో పాటు తెచ్చిన రెకమండేషన్ లెటర్ యిచ్చాడు. దాని ప్రకారంగా అతను యాభై కిలోమీటర్ల దూరంలో గల మండలాఫీసులో ప్యూను.

పేషెంటు దగ్గుతూ నిలబడలేకున్నాడు. తెల్లగా పాలిపోయి వున్నాడు.

నాగేంద్రం అతన్ని కూర్చుండమని సైగ చేశాడు. అతను బొల బొల ఏడుస్తూ నాగేంద్రం కాళ్ళ మీద పడిపోయాడు.

"ఎట్లనన్న బత్కి-య్యాలెసార్ అయిదుగురు పిల్లలు చిన్న పిల్లలు సార్." ఉర్దూలో చెప్పాడు.

అతన్ని లేవనెత్తి కూర్చుండబెట్టి పల్సు చూశాడు. ఎక్సరే, రక్తపరీక్ష తెమడ పరీక్షలకు చిట్టీ రాసి చేతికిచ్చాడు.

"సార్ ఇవ్వన్నిటికీ ఎంతవుతుంది సార్."

"యాభై రూపాయలు" నాగేంద్రం

ఆ పేషెంటు లేవలేదు. ముఖంలో చెప్పరాని దైన్యం. బీదతనాన్ని తను గుర్తుపట్టగలడు.

కాంపౌండరును పిలిచి అతనితో పేషెంటును పొమ్మన్నాడు.

"పైసే సాబ్?" పేషెంటు.

"తర్వాత చూద్దాం. పరీక్షలు తీసుకొనిరా" నాగేంద్రం.

ఎదురుగా పోస్టుమన్ - మెడికల్ జర్నల్స్ - మందుల క్యాటలాగులు, అందులో ఒక ఉత్తరం.

ఉత్తరం విప్పి చూశాడు ఊరి నుండి తమ్ముడు రాసింది.

"ఈసారీ వానలు ముంచిపోయినయ్. మన ఇల్లు గోడ ఒక పక్క పడి పోయింది. చెరువు తెగిపోయి మన పొలంలో అర ఎకరం దాకా ఇసుక మేట వేసింది. ఇయ్యేడు ఎట్లా గట్టెక్కుతామో తెలువదు. అవ్వ, వదిన, పిల్లలు భాగానే ఉన్నారు. అవ్వ నీకు ఈ సంగతులు రాయమన్నది." ఉత్తరం సారాంశం.

నాగేంద్రం గత మూడు సంవత్సరాలుగా ఊరికి పోలేదు. తల్లిని చూడ లేదు. అదే కోపం. తల్లి బీదగా ఉంటుంది. తల్లిని తన దగ్గరికి ఎప్పుడూ తీసుకురాలేదు. తనుండేది షోష్ లొకాలిటీ. తిరిగేది పై అంతస్థు వాళ్ళతో- తన బీద తల్లిని చూసి ... తనను అంచనా కడతారేమోనని సందేహం. ఎవరైనా వచ్చినప్పుడు తల్లికి కొత్త బట్టలు కొని పంపిస్తూ తృప్తి పడతాడు. కాని నాగేంద్రం తల్లి లసుమవ్వ నాగేంద్రం పంపిన ఒక్క చీరా కట్టలేదని నాగేంద్రంకు తెలియదు.

తన లోపల పేరుకుపోతున్న అసంతృప్తి విడివడటంవల్ల వచ్చిందేమో?

నాగేంద్రం ఆ జ్ఞాపకాల నుండి, ఆ అసంతృప్తి నుండీ బయటపడటానికి స్కూటరెక్కి నర్సింగ్‌హోంకు వెళ్ళాడు అక్కడ పేషెంట్లను చూసేసరికి పావు తక్కువ పన్నెండు అయ్యింది. భోజనానికి బయలుదేరుదా మనుకునే

సరికి పదిహేను కిలోమీటర్ల దూరం నుండి ఒక పేషెంటును ఎడ్లబండి మీద తీసుకువచ్చారు.

ఆ పేషెంటు ఒక గిరిజన స్త్రీ- ముప్పయి సంవత్సరాల వయస్సు ఉంటుందేమో?

పేషెంటు స్పృహలో లేదు. పేషెంటుతోపాటు ఒక ముసలివాడు, ఒక నడి వయస్సు మనిషి, ఏడాది దాటని పసిపిల్ల, ఆ పిల్లను ఎత్తుకొని ఇంకో స్త్రీ వచ్చారు. పసిపిల్ల తల్లి పాల కోసం పెడ బొబ్బలు పెడుతున్నది.

డాక్టర్ సునీల్ వాళ్ళనేదో అడిగాడు. వాళ్ళకు గోండీ భాష తప్ప సరిగా తెలుగురాదు.

వచ్చీ రాని తెలుగులో ముసలివాడు ఏదో చెప్పాడు. నిన్న పగలు కడుపులో నొప్పని పడిపోయిందట. ఆమె భర్త లూటీ కేసో మరేదో కేసు వల్ల జైల్లో ఉన్నాడట- వాళ్ళిద్దరు బంధువులంట- వాళ్ళ దగ్గర అంతా కలుపుతే నూరు రూపాయిలు లేవట. ఆ స్త్రీ కాళ్ళ కడియాలు వెండివి- మరేవో చూపుతున్నారు.

"ఇది ప్రైవేటు నర్సింగ్‌హోం. గవర్నమెంటుది కాదు" సునీల్.

సర్కారు దవాఖానలో ఈ కేసు తీసుకోలేదన్నారు వాళ్ళు.

"సునీల్ - డబ్బు సంగతి తరువాత - అల్సర్ కేసులాగున్నది" మౌనంగా కూర్చున్న నాగేంద్రం.

"డాక్టర్ సాబ్!" సునీల్ చేతిలో పెన్ను గిర గిర తిప్పుతూ - ఆ గొంతులో 'ఇట్లా చేస్తే మన నర్సింగ్‌హోం మూతపడగలదనే' ధ్వని నాగేంద్రంకు వినిపించింది.

నాగేంద్రం నిట్టూర్చి పేషెంటును లోపలికి తీసుకు రమ్మన్నాడు.

కడుపు బాగా ఉబ్బి ఉన్నది. కళ్ళు కళ తప్పాయి. పరీక్షలు అన్నీ జరిగే సరికి ఒంటిగంటయ్యింది సర్జన్ అయిష్టంగా ఆపరేషన్ థియేటర్లోకి నడిచాడు.

పేషెంటుకు రక్తం కావాలి వెంట వచ్చిన వాళ్ళల్లో ఎవరి గ్రూపు రక్తం కలువలేదు. రెండు వందలిచ్చి కాంపౌండర్‌ను తరిమాడు ఒక్క బాటిల్ మాత్రమే దొరికింది. ఆపరేషన్ ప్రారంభమయ్యింది.

ఆ రక్తం సరిపోదు. కడుపులో పేగు తెగిపోయింది

నాగేంద్రం ఆపరేషన్ థియేటర్ బయటకు వచ్చి ఎటూ తోచక మళ్ళీ లోపలికి నడిచాడు. ఇంకా ఒక బాటిల్ రక్తమైనా కావాలి. నాగేంద్రం గ్రూపు

కలుస్తుంది. నాగేంద్రం బల్ల మీద పడుకున్నాడు.... ఒక బాటిల్ రక్తం తీశారు.

ఆపరేషన్ అయిపోయేసరికి మూడు గంటలయ్యింది. ఆపరేషన్ చేయగల్గారు కాని పేషెంటు పరిస్థితి ప్రమాదంగానే వున్నది.

నాగేంద్రం థియేటర్ నుండి బయటపడే సరికి ఇంటి దగ్గరి నుండి పక్కింటి పిల్లవాడు "సులోచన, పిల్లలు వచ్చారని" తాళంచెవి కోసం వచ్చాడు.

నాగేంద్రంకు నీరసంగా ఉన్నది. ఇంటికి వచ్చి సులోచనతో ఒకటి రెండు పొడిమాటలు మాట్లాడి ముందు గదిలో బల్ల మీద నిదురపోయాడు.

ఎంత సేపు పడుకున్నాడో తెలియదు. ఫోను అదే పనిగా మోగుతోంది.

సులోచన ఫోనెత్తింది.

నర్సింగ్‌హోం నుండి సునీల్ చేస్తున్నాడు. నాగేంద్రంను లేపింది. ఆపరేషనయిన పేషెంటు చనిపోయిందన్న వార్త.

నాగేంద్రం నిద్రమత్తు వదిలిపోయింది. నాగేంద్రం ఫోను పెట్టడం కూడా మరిచిపోయాడు.

* * *

నాగేంద్రంకు రెండు రోజులు జ్వరం పట్టుకున్నది. కళ్ళు మూస్తే, తెరిస్తే ఊరు కళ్ళల్లో కన్పిస్తున్నది. బాల్యానికి సంబంధించిన కలలు వెంటాడుతున్నాయి.

తను ఊరికి ఆఖరిసారి వెళ్ళింది - తన పెద్దన్న ఆక్సిడెంటులో చనిపోయినప్పుడు, దినకర్మలకు మాత్రమే.

మూడోనాడు సాయంత్రం ఏడు గంటలు కావస్తున్నది నాగేంద్రం టి వీ. రొద భరించలేక ముందు గదిలో ఒంటరిగా కూర్చున్నాడు. జ్వరం తగ్గింది కాని ఒంట్లో నలత తగ్గలేదు.

నాగేంద్రం కొడుకు అంబాడుతూ వచ్చి కాళ్ళ దగ్గర తండ్రి ముఖం విచిత్రంగా చూస్తూ కూర్చున్నాడు. నాగేంద్రం కళ్ళు మూసుకున్నాడు. పరామర్శల కోసం వచ్చి పోయేవాళ్ళు దాదాపుగా విసిగించారు.

తనకేసి చూడకపోయేసరికి పిల్లవాడు ఏడుపు లంకించుకున్నాడు.

ఏడుపు విని సులోచన ముందు గదిలోకి వచ్చి "వాడు ఏడుస్తున్నా తీసుకోరేమండీ! మీ ధ్యాస మీదేగాని మమ్మల్ని ఏనాడు పట్టించుకోనైతిరి. అందరనుకుంటరు - సులోచనకేంది పెద్ద డాక్టరు భార్యని! అన్నీ ఉన్నా...." సులోచన నోరు విప్పిందంటే మాటలకు అంతు వుండదు.

నాగేంద్రం కొడుకును ఎత్తుకోబోయాడు.

సులోచన విసురుగా పిల్లవాన్ని తీసుకొని లోపలికి పోయింది.

"రోగులు, క్లినిక్, నర్సింగ్‌హోం. ఇంటి దగ్గరున్నప్పుడు నోరు మెద పరు. ఇలాంటివాళ్ళు పెళ్ళి చేసుకోకుండా వుండవలసింది." లోపలి నుండి సులోచన- గొంతులో గురగుర.

రానురాను ఒకే కప్పు కింద బతుకుతున్నా ఇద్దరి ప్రపంచాలు వేరౌతున్నాయి. బహుశా తనకు నటించడం రాదు. మాట్లాడడం కూడా రాదేమో?

"ఈ ఊళ్ళో డాక్టర్లు లేరు. వాళ్ళకు పెళ్ళాం పిల్లలు లేరు. సినిమాలా? షికార్లా! అచ్చటా? ముచ్చటా?"

"సులోచనా?" నాగేంద్రం నిస్పృహగా పిలిచాడు.

టి.వి. హోరులో ఆ పిలుపు ఆమెను చేరనేలేదు. ఈ మాటలన్నిటికన్నా మిన్నగా పిల్లవాడు బెదిరిపోయి ఏడుస్తున్నాడు.

తన బాధేమిటో? తనెక్కడ తచ్చాడుతున్నాడో సులోచనకు తెలియదు. తెలిసే అవకాశం కన్పించడం లేదు. ఆమె ప్రపంచం నాలుగు గోడల మధ్య. ఆ నాలుగు గోడల మధ్యకు టి.వి. తెచ్చే తలకిందుల సంస్కృతి. ఐ లవ్ యూ యూ లవ్ మీ అంటే తప్ప ప్రేమ తెలియదు. రానురానూ మానవ జీవితాలు గాలిలో ఎందుకు వేలాడుతున్నాయి? తమ మాత్రమే ఎందుకు క్షోభ పడుతున్నాడు? అందరి దాంపత్యాలూ ఇంచుమించు ఇంతేనా?

బట్టలు వేసుకొని మాట్లాడకుండా బయటకు నడిచాడు. స్కూటరు తియ్య లేదు ఎటు వెళ్ళాలి? ఎక్కడికి పోయినా, ఏ మిత్రుడి దగ్గరికి వెళ్ళినా డబ్బు, హోదా వాసన వేసే మాటలు. అసలు తనకు నిజమైన మిత్రులంటూ ఉన్నారా?

తనెప్పుడో మెడికల్ కాన్ఫ్రెన్సుకి కలకత్తా వెళ్ళినప్పుడు అక్కడ ఒక హిందీ నాటకం చూశాడు. అందులో ఒక పాటను తనిప్పటికీ మరిచిపోలేదు. ఆ పాట చరణాలు జ్ఞాపకం వచ్చాయి.

ఒక పల్లె - పల్లెలో మర్రి నీడలో ఆశల ఇల్లు. వాగు పక్క గెంతిన బాల్యం, చేలల్లో మొగ్గతొడిగిన యవ్వనం - అప్పుడు ఏది చేసినా అది ఒక కథ. కాని పట్టణంలో మందిలో తప్పిపోయానిప్పుడు. బీహారీ జానపద బాణీలో తంబూరాలాంటిదేదో వాయిద్యం మీటుతూ కంఠనరాలుబ్బుతుండగా ఒక బక్క పలుచని వ్యక్తి అదో విధమైన మైమరిపించే కంఠస్వరంతో పాడాడు అది పాటగా కాకుండా తన జీవన సారం పిండిన అనుభవంగా- దురదృష్టం కొద్దీ

ఒక మహా తుఫానులో చిక్కుకుపోయిన కోయిల్లా పాడాడు. పాట అయిపోయే సరికి తను కన్నీళ్ళతో తడిసి ముద్దయిపోయాడు.

పాట మైకంలో డాక్టరు నాగేంద్రం ఎరిగిన మనుషులను, వాళ్ళ నమస్తే లను తప్పించుకుంటూ చాలాసేపు ఒంటరిగా తిరిగాడు. నేషనల్ హైవే పక్కనే ఊరు చివరన గల ఒక హోటల్ గుడిసెలో టీ తాగాడు. హోటల్ యజమాని తాగి వున్నాడు. పైగా చాలా లారీలు ఆగివుండి సందడిగా ఉండటం వల్ల నాగేంద్రంను గుర్తుపట్టలేదు. గుడ్లు, మాంసం వేపుడు వాసనల మధ్య పంజాబీ లారీ డ్రైవర్లు నులక మంచాల మీద కూర్చుండి లోకంలో ఏ చీకూ చింతా లేనట్టు తింటూ, లొడ లొడ మాట్లాడుతున్నారు.

నాగేంద్రంకు ఏదో కొత్త ప్రపంచంలోకి అడుగు పెట్టినట్టున్నది.

ఇంటికి వచ్చేసరికి తొమ్మిదిన్నర అయ్యింది.

విశాలమైన డైనింగ్ టేబులు మీద కురియనున్న మేఘంలాటి ముఖంతో సులోచన వడ్డించింది.

"సులోచనా? నేను నాలుగు రోజులు మా ఇంటికి పోయి వస్తా" ఆత్మీయ మైన గొంతుతో నాగేంద్రం.

సులోచన మాట్లాడలేదు.

"మన ఇల్లు కూలిపోయిందట. చెరువుతెగి పొలంలో ఇసుక మేట వేసిం దట."

"మీరు ఇసుక తొలగిస్తారా? ఇంటికి గోడలు కడతారా?"

నాగేంద్రం జవాబు చెప్పకుండా సులోచన ముఖంలోకి చూశాడు

"నేను వద్దంటే మాత్రం ఊరుకుంటారా? మీ ఇల్లు, మీ ఊరు మీ యిష్టం. నా మాట ఎప్పుడన్నా విన్నారు గనుకనా? ఇల్లు కట్టి మనకు చాలా డబ్బు ఖర్చయ్యింది. నేను మా అమ్మ వాళ్ళింటికి పోతనంటే నా వెంట రావ డానికి మీకు తీరిక లేదు ఒక్కదాన్ని పంపించారు. అప్పుడు మీ రోగులు, క్లినిక్కు అడ్డొచ్చారు నా వెంటన ఎక్కడికి మీరు రాలేరు - నామోషీ కద - నేను డాక్టరును కాదుగదా! ఎండాకాలం మీ తమ్ముడు వచ్చి వ్యవసాయానికి కావాలని రెండువేలు తీసుకుపోయాడు. మొత్తం భూమి తనే దున్నుకొని పంట అనుభవిస్తున్నాడు."

"సులోచనా! వాడు పట్టిలో మన్నైన నన్ను చదివించాడు. నేను మోయ వలసిన ఇంటి బాధ్యతను ఎప్పటి నుంచో వాడు మోస్తున్నాడు మా అన్న తినీ

తినక నా చదువుకు డబ్బు పంపి.... ఇవ్వాళ మనం ఇట్లా బతుకుతున్నా మంటే.... నీకు అర్థం కాదు సులోచనా...."

"నాకెందుకు అర్థమౌతుందండీ - మీ సంపాదన మొత్తం తీసుకువెళ్ళి వాళ్ళకే పెట్టండి"

"సులోచనా?" నాగేంద్రం దాదాపు అరిచాడు.

సులోచన ఏడుస్తూ పడక గదిలోకి వెళ్ళిపోయింది.

నాగేంద్రం అన్నంలో చెయ్యి కడిగి ముందుగదిలో బల్లమీద వెల్లకిలా పడుకున్నాడు.

బెడ్‌రూంలో నుండి వెక్కిళ్ళు విన్పిస్తూనే ఉన్నాయి.

తను ఎవరి దుఃఖాలు మాత్రం తీర్చగలిగాడని - రాను రానూ తను ఇంత చేతకాని వాడిలాగా ఎందుకు తయారౌతున్నట్టు? తన పల్లె నుండీ, కన్న తల్లి నుండీ తనను దూరం చేసిందెవరు? సులోచనకూ, తనకూ మధ్య నిలిచిన అడ్డు గోడేమిటి? తలపోటు ప్రారంభమయ్యింది.

నర్సింగ్‌హోంకు ఫోన్ చేసి "అర్జెంటు పని మీద నేను ఊరు వెడుతు న్నాను. నాలుగు రోజులు మానేజ్ చెయ్యండి" అని డ్యూటీలో ఉన్న డాక్టరుకు చెప్పాడు.

రాత్రి గడుస్తోంది. నాగేంద్రం నిద్ర రాక పొర్లుతున్నాడు.

* * *

కల్వర్టు మీద ఇద్దరు పిల్లలు చీమిడి ఎగపీలుస్తూ గాలాలు వేస్తున్నారు. ఒక పిల్లవాడు తండ్రిదో మరెవ్వరిదో గానీ మోకాళ్ళ దాకా వేలాడే అంగీ వేసు కున్నాడు. ఇంకో పిల్లవానికీ నిక్కరు తప్ప అంగీ లేదు.

నాగేంద్రం నడక అలవాటు లేక అలిసిపోయాడు. మెయిన్ రోడ్డు దిగి మూడు కిలోమీటర్లు నడవాలి.

పడమటి వేపు కొండమీద పొద్దు వేలాడుతోంది కొండ వాలులో ఎక్కడి దాకనో వ్యాపించిన తాళ్ల కొసలు ఎర్ర డౌలులో మెరుస్తున్నాయి. తన ఇల్లు చేరుకోవాలంటే కనీసం ఇంకా మైలు దూరం నడవాలి.

రోడ్డుకు ఆ పక్క, ఈ పక్క పెసరు చెలుకలు పచ్చగా నవనవలాడు తున్నాయి.

ఆ ఇద్దరు పిల్లలనూ వాళ్ళ గాలాలనూ చూస్తే మరిచిపోయిన బాల్యం గుర్తొచ్చింది. కాసేపు పిల్లల దగ్గర ఆగాడు పిల్లలిద్దరూ అనుమానంగా నాగేంద్రంను చూశారు.

"ఎందుకట్లా చూస్తున్నారు?" నాగేంద్రం.

ఈసారి పిల్లలు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు.

నాగేంద్రం కల్వర్టు మీదికెక్కి తుంగతో నిండి ఉన్న నీళ్ళ మడుగులో గాలం బెండు మునగా తేల సయ్యాటలాడటం చూశాడు.

"బొగవి గాలం చేపలు ఎండ పూట పడుతాయి గదా!" నాగేంద్రం నీళ్ళ మీద ఎగిరే కొడిపె చేపలు చూస్తూ అడిగాడు.

"మాల పంకిడి గాళ్ళు, మార్పులు (ఒక రకమైన చేపలు) ఎండపూట చిత్తుబొత్తుకొంగ పడుతాయి. జెల్ల కొయ్యలు, కొడిసెలు మాపటి పూటనే పడ్తాయి" ఒక పిల్లవాడు ఓస్ గంత పెద్దోనికి గీ సంగతి తెలియదా? అన్నట్టు చెప్పి గాలం లాగాడు. లివ్వర లివ్వర కొట్టుకుంటూ తెల్లగా మెరిసే జెల్లకొయ్య గాలంతో పాటు బయటకు వచ్చింది. ఆ చేపను గాలం నుండి ఊడదీసి సంచిలో వేసుకుని, ఎర్ర సరిచేసి దాని మీద ఉమ్మి, గాలం మళ్ళీ నీళ్ళల్లో వేశాడు.

"మీరెవలు?" రెండో పిల్లవాడు.

'ఎవరని చెప్పాలి?' నాగేంద్రం తికమకపడ్డాడు.

"నేను నాగేంద్రంను" నాగేంద్రం తడబడుతూ.

పిల్లలిద్దరికీ తెలియలేదు. వాళ్ళకెట్లా చెప్పాలో నాగేంద్రంకు తెలియలేదు ఆ ఊరికీ, తనకున్న సంబంధం ఎట్లా చెప్పాలి?

"లసునువ్వ నడిపి కొడుకును. లచ్చింరాజు అన్నను" నాగేంద్రం

"ఓహో డాకుతారి వంశె నువ్వేనా?" లొడలొడ అంగీ పిల్లవాడు.

"దెహీ మనూల్లె శంకరయ్య డాకుతా ననుకుంటన్నవా? పేద్ద డాకుతారి" రెండోవాడు.

నాగేంద్రం ముందుకు నడిచాడు. మనసులో అనేక రకాల చేపలు మెదిలాయి. బొమ్మెలు, గండెలు, బురదమొట్టలు, పాసెర్లు, సాలెకొర్రమట్టలు, వాలుగలు, తీగదారు పొదల్లో కూర్చుండి తన గుండె కొట్టుకోవడం తనకే విన్పించగా చెరువు అలుగుల్లో గాలాలు వేయడం, ఆ ఏకాగ్రత...' వంద గజాల దూరం నడిస్తే అడ్డదారి. అడ్డదారి కటూ ఇటూ వాయిలి పొదలు బాగా పెరిగి వున్నాయి. వావిలి పొగల మీదుగా తూర్పున చెరువు కట్ట - దూరంగా ముస్లిం సమాధులు తెల్లగా కవ్పిస్తున్నాయి. సమాధుల కావల మామిడి తోట-తోట పైభాగంలో 'లాల్పావుల' గుట్టబోరు. పీర్ల పండుగకు ఆ గుట్ట మీది నుండి తల్లి పీరిని తెస్తారు. అగ్గిగుండం- "ఆశన్న ఊశన్న అన్నదమ్ములు" పదాలు. వావిలాకు వాసన గుప్పు మన్నది. "వావిలి కట్టెకు వంగది గుర్రం.

తుంగ పోసకు దూగది గుర్రం" ఎండాకాలం కాముని పున్నానికి అదే జాజిరాట. వావిలి చెట్ల కావల అందరూ పొలాలు శాస్తేశారు. మిట్టలు బీడు పడే ఉన్నాయి. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. - తమ్ముడు చెరువు తెగిపోయినట్టు రాసిన సంగతి.

మరికొంత దూరం నడిచేసరికి కర్ర ఇరుసు కుయ్యో మొర్రో అంటుం డగా పెద్ద బండి ఎదురయింది. బండ్ల బాట ఇరుగ్గా ఉన్నది. నాగేంద్రం వాయిలి పొదలకు వొదిగాడు

బండిలో ఇంకా పదహారు సంవత్సరాల వయసు నిండని యువతి పురిటి నొప్పులు పడుతోంది. ఆమె పక్క ఆ యువతి తల్లి కూర్చుంది "ఓర్చుకో" మంటున్నది. నొగల మీద మాగిన కుండలాంటి శరీరం గల మొండయ్య కూర్చున్నాడు.

"ఎవలాల్లో" మొండయ్య.

"నేనేనే మామ" నాగేంద్రం.

మొండయ్య ఎగాదిగా చూసి "నువ్వా - ఎవలో అనుకున్న" అని, నాలిక కరుచుకొని "ఎప్పుడు బస్సు దిగినవయ్యా!" అన్నాడు. అంతకన్నా "ఎప్పుడు దిగినవుర నాగయ్య" అంటేనే బావుండు ననిపించింది నాగేంద్రంకు.

"తొలిసూరు కానుపు డాకుతరి కాడికి తీసుకుపోతన్న" మొండయ్య ఏమనాలో తోచక.

"జెర బండాపవయ్యా" బండిలో స్త్రీ.

బండాగింది. "జెర మరదలి సెయ్యి సూడు" అన్నది.

నాగేంద్రంను చూసి ఆ పిల్ల సిగ్గు పడ్డది కొంచె జెడ చీమిడి ముక్కుతో వూరంతా తనేనన్నట్టు ఎగిరే పద్మ - వయసు చాలా చిన్నది. ఒంట్లో బలం లేనట్టున్నది. నాగేంద్రం చెయ్యి పట్టి నాడి చూశాడు. "నొప్పులు ఎప్పుడు మొదలైనయ్?"

"ఇయ్యాల్ల వద్దనంగ సెరువు గండి కాడికి మట్టిపనికి పోయింది ఎపలా ల్లకు కుసకుస మన్నది" ఆ స్త్రీ.

ఇంకా నెలలు నిండనట్లే ఉన్నది. బలహీనంగా ఉన్నది. చెంపల మీద ఎముకలు తేలాయి. మాల్ న్యూట్రిషన్. ముఖంలో గాభరా తప్ప ఇంకా నొప్పులు ప్రారంభం కాలేదు. తన దగ్గరేమీ లేదు.

"ఏమీ కాదు. రెస్టు కావాలె - మందులు వాడాలె - డాక్టరు దగ్గరికి తీసుక పోండి" నాగేంద్రం.

"నువ్వేం పెద్ద డాక్టరువైతివి" అన్నట్టున్నాయి పద్మ చూపులు.

"నేను అనుకోకుండా బయలెల్లిన - నా దగ్గర ఏమీ లేవు...."

చిన్న కాగితం పెతికి మందులు రాసి యిచ్చి నాగేంద్రం తల వంచుకొని ముందుకు నడిచాడు

బండి ఇరుసు రాగం దూరమైపోతున్నది. పద్మ ముఖంలోని సిగ్గు కొత్తగా, వింతగా ఉన్నది. నాగేంద్రంకు స్పష్టంకాని ఎప్పటివో జ్ఞాపకాలు బుసబుస పొంగాయి. దారికి రెండు పక్కలా ఈత పొదలు వచ్చాయి. ఈత పొదల్లో అప్పుడే చిమ్మెట్లు పలుకుతున్నాయి. ఎక్కడో పూరేడుపిట్ట కుర్రుమంటోంది. పొలాల మీదుగా బురద వాసనతో వెచ్చటి గాలి. తనకు సరిగ్గా జ్ఞాపకం రావడంలేదుగానీ యవ్వనం, చెమట కలిసిన ఆడవాసన - పద్మ ముఖం లాంటి ముఖమే - నవ్వితే సొట్టలు పడే పచ్చటి ముఖం - గాలిలో పరుగెత్తే చురుకుదనం, పైరగాలి మోతిలాంటి కంఠం.... గంగ....

నాగేంద్రంకు గంగ జ్ఞాపకం శరీరమంతా పాకింది. గుండె దడదడ కొట్టుకున్నది. గంగ మొండయ్య అన్న కూతురు.

పడమటి తాటిచెట్లు స్పష్టంగా కన్పిస్తున్నాయి. సూర్యుడు కుంకడు

ఊరి చివర హరిజన వాడ - హరిజన వాడలో చాలా ఇండ్లు గూన పెంకలేశారు. రంగు రంగుల గుడ్డల వాళ్ళు ఆదర బాదరగా తిరుగుతున్నారు. పిల్లలు గిలేటి పెళ్లేలు దప్పులు కొడుతున్నారు. ఎవరో వేగంగా తాడు పేనుతున్నారు.

నాగేంద్రం ఊరు జొరడం పశువుల మంద రావడం ఒక్కసారే జరిగాయి. పశువుల కాలిగిట్టల చప్పుడు, గొడ్ల వాసన - అరుపులు - తల్లి ఆవు కోసం తల్లడిల్లుతూ ఒర్లే లేగలు. గొడ్ల మంద వెనుక అలసిపోయి కాళ్లీడుస్తూ గొడ్ల బోయిల్లు - 'తిరుమని' చేతి కట్టెలు, సుట్టల కోసం వెంటబడుతున్న పిల్లలు- గొడ్ల మంద పోయేదాకా ఒక చూరు కింద నిలబడ్డాడు నాగేంద్రం. తన బట్టలు జూసి గొడ్లు బెదిరి బెదిరి పక్కగా పోయినయ్.

చింతల కింద పనులకు పోయి వచ్చిన వాళ్లు బరిబాత సెయ్యిలను చారికలు బడ గోక్కుంటూ ముచ్చట్లు బెడుతున్నారు. స్త్రీలు నిప్పు కోసం గూన పెంకలు తీసుకొని తిరుగుతున్నారు. కొన్ని ఇండ్ల మీదుగా పొగ బద్దకంగా లేస్తోంది. పిల్లలు 'మొలక వడ్లు' దంచిన అటుకులు బుక్కుతూ పరుగెత్తుతున్నారు.

సగం మంది గుర్తుపట్టనే లేదు. చాలా మంది తాగి వున్నట్టుగానే కనిపిస్తున్నారు. గాలి వాటం మాటలు - కళలేని నవ్వులు చూస్తే నాగేంద్రంకు అట్లా అన్పించింది.

గుర్తుపట్టిన వాళ్ళు "నువ్వా పిలగా" అలవాటు ప్రకారంగా వరుసలు గట్టి ఏదో అనబోయి- అలవాటుగాని గౌరవం అడ్డురాగా తికమక పడుతున్నారు.

చాకలివాగలో కాటోలు కుక్కలు అదే పనిగ మొరుగుతున్నాయి. గొడ్ల మెడల్లోని బొనుగలు ఇంకా ఊగుతున్నాయి.

నాగేంద్రం వేషం జూసి ఊరికేదో ఉపద్రవం రాబోతున్నదన్నంత కోపంగా నల్లకుక్క ఒకటి జంయ్యిన లేచింది.

"అడీ.... పంబె లేవ సాతగాదు" దాన్ని దూరం గొట్టి ఎంబదోల్ల వెంకటనర్సు "నువ్వా కొడుకా? సానొద్దులాయె. సదువుకున్న మారాజులు. కానరావి దేశాలల్ల కాలు మీద కాలేసుకొని బతుకుతరు. ఎక్కడెవలు దిక్కు లేకపోతే అక్క మొగడే దిక్కంట- సచ్చినా బతికినా మేం గీ ఊరొందులం.... కోప్పడకు కొడుకా? అసుమ్మ వదినెది మొదటి నుంచి మొదటి దాక కట్టపు పుటుకు. గీ ముసలితనానికన్న నీ ఎంట తీసుకుపోరాదు" అనుకుంటూ ముందుకు నడిచి- మళ్ళీ ఆగి "మారె అది బెంగటీలి సత్తది సదువుకునోల్లంటే ఏడనైన ఒక్క సిత్తం జేసుకొని బతుకుతరు మా ఆసొంటోల్లు గీ ఊరిడిసిపెడితె బెక్కన బెంగటీలి సత్తం" అనుకుంటూనే మూల మలుపు తిరిగాడు.

నాగేంద్రంకు అనేక జ్ఞాపకాలు పోటెత్తుతుండగా ఎగుడు దిగుడు వీధిలో నడుస్తున్నాడు. ఏడ్చి ఏడ్చి తల్లి ఎత్తుకోగానే పులకించిపోయి ఏడుపు మరిచిన పసిపిల్ల వాడిలాగా ఊరు నాగేంద్రంను అక్కున చేర్చుకున్నట్లుగా వున్నది. ఈ వీధుల్లో ఈ మట్టిలో తను నడక నేర్చుకున్నాడు. ముఖాలు గుర్తుపట్టడం, ఆట, పాట, మాట నేర్చుకున్నాడు. ఏడ్చాడు, నవ్వాడు. ఈ ఊరిలో తను గడిపిన ప్రతి అనుభవం ఒక కథ.

కుమ్మరి సాయిలు చింత కింద ఎవరు లేరు. కుడి చెయ్యి కేసి వున్న కుమ్మరి సాయిలు పెంకుటిల్లు పాడుబడి వున్నది. దాని ముందు 'ఆవం' కూలిపోయి శిథిలమైన కోట గోడలాగా వున్నది. నాగేంద్రం తనకు తెలియకుండానే అక్కడ నిలబడిపోయాడు. గోలీలు, సిర్రగోనే - వెన్నెల రాత్రుల్లో ఈ చింత మొదట్లో ఒక జట్టు - అవతల అప్పని రామచంద్రం కొట్టంలో ఒక జట్టు- పూర్తిగా గుడ్డలుకప్పి చెరొక పిల్లవాన్ని తెచ్చేవాళ్ళు- అచ్చం కోడిపుంజుల్లాగే

గూసేవాళ్ళు. కూత విని గుర్తు పట్టి ఈ గుడ్డల కింద వాళ్ళ పేర్లు చెప్పాలి. గంగ తను ముందే కూడబలుక్కుని తెలిసేటట్టుగా గూసేవాళ్ళు. ఇద్దరు ఒకే జట్టులో అట్లా చేరిపోయేవాళ్ళు

ఇదే చింత కింద చిరుతల రామాయణం- అడుగులు, వేషాలు- చింది మాదుగుల భాగోతం, గోత్రాలోళ్ల అల్లి రాణి, మాట్లోళ్ల పౌడవల కథ, చుక్కలు జెగజెగలాడే రాత్రిలో బుడుగు జంగం రాయమల్లు తీగలాంటి రాగం, ఆరుగురు మరాఠీలు, బాలనాగమ్మ - గంగ వాళ్ళ చెవుడు నాయివమ్మ ఒళ్ళో నుండి తప్పించుకొని తన పిర్ర గిచ్చేది. బాలనాగమ్మలో బాలవర్ధిరాజు తనే అనుకునేవాడు "అవ్వా అవ్వా ఏడేడు సముద్రాలు దాటి" ఎన్నటికైనా అవ్వకు సుకం కలిగిత్తననుకునే వాడు. అవ్వ ఆ మాట అందరికీ చెప్పుకొని మురిసి పోయేది. ఏవీ ఆ కలలు, ఏవీ ఆ మాటలు గంగ.... చెరువులో తేటనీటి లాంటి గంగ- అడివిలో గలగలపారే పెంకలవాగు లాంటి గంగ- ఇన్ని రోజులుగా తనకు అనేక విషయాలు జ్ఞాపకం వచ్చినా గంగ మాత్రం జ్ఞాపకం రాలేదు. ఎందుచేతనో?

తనకన్నా నాలుగేండ్లు మాత్రమే చిన్న. బహుశా ఇప్పుడు ఒంట్లో మెరుపుతగ్గి ముసలి రూపం పడి వుంటుంది తల్లిగారింటికి బతుకమ్మ పండుక్కు వస్తున్నదో లేదో? ఎందరు పిల్లలో? గంగకు నేను మతికున్నానా?

ఇలాంటి జ్ఞాపకాలతో మందలిచ్చిన వాళ్ళకేదో చెప్పుతూ నాగేంద్రం ఇంటికి చేరుకున్నాడు.

ఇంటిముందు గల బొడ్డుమల్లె చెట్టు గాలివానకు వేర్లతోసహా కూలిపోయి నట్టున్నది. దాని కాండం నరికేశారు. తనలాగే కొమ్మలు నరికిన మొదలు వేర్లతోసహా పడివున్నది.

పెంకుటిల్లు బజారు వేపు గోడ కూలిపోయి వున్నది. కూలిన దగ్గర పాత సంచి బొంతలు కట్టారు.

ఇంటిముందు రోటి కాడ మరదలు లక్ష్మి కారం నూరుతోంది. ఇంటి ముందుగల గడ్డి కొట్టంలో లసుమవ్వ ఏడిచే పసిపిల్లవాన్ని సముదాయించలేక సతమతమవుతున్నది.

భూమి పొరల్లో నుండి మొలచుక వచ్చిన వానిలాగా నాగేంద్రం వాకిట్లో నిలుచున్నాడు

లక్ష్మి చూసి మొదట విస్తుపోయి గాభరాగా "అత్తా బావచ్చిండు" బొడ్లో దోపుకున్న కొంగు తీసి భుజం మీద కప్పుకుంటూ-

నాగేంద్రం కళ్లల్లో గుబగుబ నీళ్ళు. కీకారణ్యంలో తప్పిపోయిన లేగ దూడ తల్లి ఆవును చూసినట్టుగా....

"ఏ బావే?" అన్నది లసుమవ్వ కండ్లు కన్పించక- లక్ష్మి అత్త చేతుల్లోని పిల్లవాన్ని ఎత్తుకొని ఏదో గుసగుస చెప్పింది.

"నాగన్న. నువ్వారా కొడుకా!" లసుమవ్వ లేచి నిలబడుతూ-

నాగేంద్రం మాట్లాడితే ఏడువగలననే శంకతో తల్లికెదురు నడిచాడు. లసుమవ్వ ఆవు లేగదూడను ఒళ్ళంతా నాకినట్లుగా, పీలవమైన చేతులతో నాగేంద్రం ఒళ్ళంతా పునికింది. లసుమవ్వ చేతులు వనుకుతున్నాయి. నాగేంద్రం ఒళ్ళంతా కరిగి కరిగి భూమిలోకి ఇంకి పోయినట్లనిపించింది. మరదలున్నదనే ధ్యాస మరిచి నాగేంద్రం చప్పుడు కాకుండా కవలి కవలి ఏడ్చాడు.

"కొడుకో- కొడక- మీనాయిన నిన్ను సూసుకోకపాయె కొడుక- మీ కట్టం సూడకపాయె కొడుక- మీ సుకం సూడకపాయె కొడుక" లసుమవ్వ తనూ ఏడ్చింది. ఏదో మతి కొచ్చిన దానిలాగా ఏడుపు ఆపేసింది.

అంటే అవ్వ కూడా తనను మామూలు కొడుకులాగా చూడడం లేదన్న మాట- చదువుకున్న వానిలాగా ప్రత్యేకంగా చూస్తున్నదన్న మాట.

లక్ష్మి పెద్ద కొడుకును పిలిచింది. నాగేంద్రం మెడిసిన్ మూడో సంవత్సరంలో వుండగానే తమ్ముడు పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు తొమ్మిదేండ్ల కొడుకు- ఆ తరువాత బిడ్డ- మళ్ళీ నాలుగేండ్ల ఎడం తరువాత మళ్ళీ కొడుకు.

లక్ష్మి రాజం పెద్ద కొడుకు పేరు తండ్రి పేరు పోశాలు పెట్టుకున్నాడు.

"ఏందే నీయవ్వ" నేలకేసి కాళ్ళు బాదుతూ పోశాలు పరుగెత్తుకొచ్చాడు.

"మీ పెదనాయిన్న వచ్చిండురా?"

"ఏ పెదనాయిన్నే?"

పిల్లవాడు నల్లగా వున్నాడు. తమ్ముని పోలికలే- బెదురు బెదురుగా పందిరి గుంజ పట్టుకొని నిలుచున్నాడు.

లక్ష్మి ఇంటి వెనుక నుండి కంచు ముంతలో నీళ్ళు తెచ్చి పోశాలు చేతికిచ్చి 'పెద్దనాయిన్న కియ్యిరా' అన్నది.

నాగేంద్రం 'పైంటు' ఎత్తుకొని కాళ్ళు కడుక్కున్నాడు. లక్ష్మి ఇంట్లో నుండి నవారుమంచం తెచ్చి పందిరి కింద వేసింది.

"రారా నాయిన" నాగేంద్రంకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది. పిల్లలకేమీ తేలేదని మనసంతా నీళ్ళయిపోయింది.

"మా నాయినవు కాదుర" నాగేంద్రం గొంతు ముద్దగా.

పోశాలు ఎదురు ఎదురుగానే మంచం దగ్గరికి వచ్చి నిలుచున్నాడు. నాగేంద్రం ఒళ్ళోకి తీసుకున్నాడు. తన కన్న తండ్రి ఒడి లాగే నాగేంద్రంకు పోశాలు శరీరం వెచ్చగా అన్పించింది.

లక్ష్మి ఇంట్లో నుండి ఉతికిన ధోవతి తెచ్చింది.

నాగేంద్రం బ్రీఫ్‌కేసులో నుండి లుంగీ తీసి కట్టుకున్నాడు

"సెల్లెలు బోయిందిరా?" నాగేంద్రం.

"నీల వాళ్ళ ఇంటికాడ 'సరిబద్దు'లాడుతుంది పెదనాన్న" పోశాలు.

"ఇంటికాడ కోడలు కొడుకు మంచి గున్నార్రా నాగన్న" లసుమవ్వ.

"ఆ బాగానే వున్నరే?"

"పేరేం బెట్టిండ్లురా?" లసుమవ్వ.

నాగేంద్రంకు కొడుకు పుట్టినప్పుడు వీళ్ళను పిలవనందుకు సిగ్గేసింది. "కార్తీక" అన్నాడు.

"అదేం పేరురా?"

"నీకెరుక లేదత్తా" లక్ష్మి.

లక్ష్మి చేతుల్లోని పిల్లవాడు నాగేంద్రం దగ్గరికి వస్తానని గింజుకుంటున్నాడు.

"పోశన్న తమ్మున్ని తీసుకరారా" నాగేంద్రంకు చిన్న పిల్లవాడి పేరు తెలియదు.

చిన్న పిల్లవాడు కేరింతలు కొడుతున్నాడు.

లక్ష్మి దీపం ముట్టించి గూట్లో పెట్టింది. "మీ బాపెక్కడున్నడో తీసుకరాపోరా? శంకరయ్య మామింటికాడ సూడు. అడ లేకపోతే సారయ్య చిన్నాయినె దగ్గరుంటాడు" లక్ష్మి.

పోశాలు పరుగెత్తాడు.

"గప్పుడే సెరువు కాన్నుంచి వచ్చి తానంజేసి అట్ల ఊళ్ళెకుబోయిండు, సర్కారుకేమొ పట్టలేదు. ఊ అంటే ఊళ్ళ మీదబడి కొట్టుడు. పట్టుకపోయి కేసులు బెట్టుడుగని - సెరువులు కుంటలు జూసేటట్టున్నరా? నాగన్న, మునుపటి తీరగాలేదు ఈడంత అడ్లు సెరుగు కల్పినట్టున్నది. అడుగకపోతే గతి లేదు, అడుగుతె కోపాలు!- సెరువుగండి ఊరోల్లే పోసుకునుడంటె మాటలా?" లసుమవ్వ.

నాగేంద్రం వింటున్నాడు. ఇంతలోనే ఆరేండ్ల నిర్మల పరుగెత్తు కొచ్చింది చక్రాల్లాంటి కళ్ళు - తల్లి పోలికలు. వాకిట్లో కొత్త వ్యక్తిని చూసి బెదిరి పోయింది.

ఆ పిల్ల పేరు నాగేంద్రంకు జ్ఞాపకం వున్నది. తనే పెట్టాడు. "నిర్మా నేనేనే - మీ పెద్ద బాపును" నాగేంద్రం.

తల్లి దగ్గరికురికి కొంగు కప్పుకున్నది. "పోవే, మీ పెద్ద బాపు" లక్ష్మి నిర్మలకు గౌను సరిచేసి పంపింది.

నిర్మల సంశయపడుతూనే నాగేంద్రం దగ్గరికి వచ్చింది.

"ఏం చదువుతున్నవవ్వా?"

"ఒకటో తరగతి"

"అన్నయ్యో"

"మూడో తరగతి"

"ఏం సదువులురా? పంతుల్లు ఈ ఊళ్ళె వుండరు. రోజు రావాలె, మన ముకత్తె వత్తరు లేకపోతే లేదు" అనుమవ్వ నాగేంద్రం చదువుకున్న రోజులు జ్ఞాపకం తెచ్చుకుంటూ.

నిర్మల నాగేంద్రం ఒడిలో ఒదిగిపోయింది.

* * *

పోశాలు ముందు నడుస్తున్నాడు సూర్య కిరణాలు కళ్ళల్లో గుచ్చుకుం టున్నాయి. ఆ పక్క ఈ పక్కన గల మైదాకు చెట్ల దళ్ళు దాటి మందోట మీదికి వచ్చారు దొరగారి బాతులను పాలేరు చెరువుకేసి తోలుతున్నాడు. బాతుల ముందు రెండు తెల్లకొంగులు నడుస్తున్నాయి. పోశాలు పరిసరాలు మరిచిపోయి కొంగుల వెంటబడి - వాటిలాగే అరుస్తూ - వాటి వెంట పరుగెత్తుతున్నాడు. సనాసోల్ల ఎత్తు కాలువ దాటి ఈత ఖెట్లలో నుండి చెరువు కట్ట మీదికి పరుగెత్తి తూము మీద కూర్చున్నాడు పోశాలు - నాగేంద్రం కట్ట ఎక్కేసరికి పిచ్చుక గూళ్ళకోసం పోశాలు తిరుగుతున్నాడు.

కట్టకింద గల పెద్ద ఊడల మర్రి ఎండిపోయి వున్నది. మర్రి కింది నుండి వెళ్ళే బండ్ల బాట మీద ఎవరిదో సవారి బండి పరుగెత్తుతోంది. నాగేంద్రంకు ఎన్నో జ్ఞాపకాలు చుట్టుముట్టాయి. పోశాలు చాకిరేవుల కాడ తెల్ల బట్టలకు వేసే నీలిమందు కోసం వెతుకుతున్నాడు.

మర్రి కొమ్మల్లో కూర్చుండి తను నాగార్జునుడి సూత్రాలు బట్టీ పట్టేవాడు. సుభద్రా చౌహాన్ హిందీ పద్యం కంఠస్థం చేసేవాడు.

మర్రి కావలగల విస్తారమైన పంట భూముల్లో ట్రాక్టరు టుకటుక శబ్దం చేస్తూ దున్నుతోంది.

"పెదనాన్న గీ మర్రి నిరుడే ఎండి పోయిందే" పోశాలు. చెరువులో నీళ్ళులేక చాకిరేవుల గగ్గర చాకలి వాళ్ళు బట్టలుతికిన దాఖలాలు లేవు. కుండ పొయ్యిలు చాలావరకు కూలిపోయి వున్నాయి. తూములో నీళ్ళ రొద లేదు. బొమ్మెడి చెట్లల్లో నీళ్ళ గలగల లేదు. తూము మీద తురక సాయెబు గాలాలు వేయడం లేదు. చెరువు ఈ కాలంలో నెలలు విండిన విందు చూలాలి లాగా వుండేది. చెరువులో ఆవలి పక్క అల్లిపూలు, తామరపూలు విచ్చుకొని వుండేవి. బుడు వుంగలు, జిలుమలు వందలకు వందిలే ఈదులాడేవి.

జిలుమ గుడ్ల కోసం తుంగలో పొద్దంతా గాలించే వాళ్ళు దొరికిన గుడ్లకు పేడరాసి కాల్చుక తినేవాళ్ళు - దుంప గడ్డలు పీకి వాటిని ఉడుక బెట్టుక తినే వాళ్ళు.

చెరువు కట్టమీద నిటారుగా నిలుచున్న తాటి చెట్లు గాలికి చిత్రంగా మోగుతున్నాయి. చెరువు కట్ట వెంట గల ఈత పొదల్లో బొల్లి కోడి కునకున లాడుతోంది.

"ఓ పెదనాయెన నీకు ఈత త్తదానే" నాగేంద్రం ముఖంలోకి చూస్తూ పోశాలు.

"రాదుర" ఏమంటాడోనని.

"అయ్యో - మా భాపుకు బాగత్తది. నాకు కొద్దిగనే అత్తది. రాఘవులు గాడైతే ఎల్లుకల కూడ ఈతగొ ట్టడు" పోశాలు.

నాగేంద్రం జవాబు చెప్పకుండా ముందు నడుస్తున్నాడు.

కట్ట మధ్యలో దొంగ చింత - చింత మీద గువ్వొకటి గుగ్గూగూ అని గూస్తోంది. పొద్దు పొలాల మీద దోబూచులాడుతోంది. ఎండ పొడకు అందరు పొలాలు పచ్చగా మెరుస్తున్నాయి. పొలాలల్లో గల విప్పచెట్టు పై భాగంలో గద్దొకటి గిరికీలు కొడుతోంది. దూరంగా నాటు పెట్టని మిట్ట పొలాలల్లో పశువులు మేస్తున్నాయి మరి కొంచెం దూరం నడిచాడు. కట్ట మీద రెండు పక్కల పోలుపుగా నిలుచున్న హరిజన కూలీల్లాగా తుమ్మ చెట్లు.

కట్ట పొంట సద్ది మూటలు గట్టుకొని చాలా మంది కూలీలు వచ్చారు. అందులో కొందరు కూలీలు నాగేంద్రంను గుర్తుపట్టి దండాలు చెప్పారు. కొంత మంది నాగేంద్రం రాకను ఊహించని వాళ్ళు విస్తుపోయారు. "ఎక్కడుంటు న్నావ్? పిల్లలెంత మంది?" లాంటి పొడి మాటలు.

తను ఈ ఊరికి కొత్తవాడు. ఈ ఊరి కష్ట నష్టాలతో, సుఖదుఃఖాలతో ప్రమేయం లేని వాడు. మట్టిలో ఈ చెరువు కట్ట మీదనే బాల్యం గడిచింది. ఈ చెరువు ఊరివాళ్ళందరి బతుకులో ఒక భాగం. ఇప్పుడో తను ఈ చెరువుకు కొత్తవాడే - పరాయివాడే.

మరి కొంత దూరం నడిచేసరికి కట్ట గండి పడిన చోటు వచ్చింది. గండి దగ్గర చాలా మందితో పాటు లక్ష్మంరాజుం కూడా పని చేస్తున్నాడు.

లక్ష్మి రాజుం కూలీలకు ఏదో చెప్పి నాగేంద్రం వెంటే బయలుదేరాడు. పోశాలు బడికి పోవాలని వెనుదిరిగి వెళ్ళిపోయాడు.

ఇద్దరు కట్టదిగి పొలాలల్లో నడుస్తున్నారు. నాగేంద్రం లుంగీ ఎగగట్టి తమ్ముడి వెనుకే నడుస్తున్నాడు. నాగేంద్రంకు ఒడ్ల మీద నడవడం చేతకావడం లేదు. ఎడం వేపు ఇంకా నాట్లు వేయని మిట్ట పొలాలు. కుడివేపు అందరు పొలాలు నాట్లు వేశారుగానీ - అవి పండే నమ్మికలేదు. సకాలంలో గండి పూడ్చ గలిగితే వెనుకకు పడే వర్షాలకు చెరువులో నీళ్ళు చేరితే పండినట్టు లేకపోతే ఎండినట్లే. మిట్ట పొలాలల్లో నార్లు పెరిగిపోయి వున్నాయి. ఆశ చావని రైతులు చాలా మంది ఇంకా పొలాలు దున్నుతున్నారు.

తమ రెండెకరాల పొలం చేరుకున్నారు. చెరువు గండికి సూటిగా వున్నది. చెరువు నీటి ప్రవాహంకు ఒడ్లు పూర్తిగా తెగిపోయాయి. చాలాభాగం కోసింది. కొంత భాగం ఇసుక మేట వేసింది. దాదాపు అరెకరం పొలం, పొలం వాలకమే లేకుండా పోయింది.

మిగతా పొలం రెండు సార్లు దున్ని వున్నది కాని నీళ్ళు లేక దుక్కి ఎండిపోయి వున్నది. నారు మోకాలు మంటి పెరిగి వున్నది.

"ఇయ్యేడు అడ్ల పంట ఆశ లేదు. మేమేం దినాలె. వదినెకేం పంపాలె" లక్ష్మం రాజుం.

"పోనీ ఇసుక తీయించి, ఒడ్లు పెట్టిస్తే - గండి మూస్తే ఆగష్టు ఆఖర్లో కురిసే వర్షాలకన్నా" నాగేంద్రం.

"ఊరోల్ల మేం కష్ట పడుతున్నాం" లక్ష్మి రాజుం ఏదో అన్నాడు.

ఇయ్యేటి పంట అట్లా వుండనియ్యి. ఈ పొలాన్ని రేపుకు తేవాలంటే కనీసం మూడు వేలన్నా కావాలి అంతడబ్బు లేన దగ్గర లేదు. రెండెకరాల పెరడు మీదే ఆశ. పునాస పెసరు అధిక వర్షాలకు జాలు పట్టి పోయింది. ఇక మక్క పెరడు పండేది ఎంతో పండనిదెంతో! లక్ష్మి రాజుం మనసులో "ఇయ్యేడు అడివిల పొద్దు గూకినట్టున్నదే?" పైకి.

నాగేంద్రం ఒడ్డు మీద ముంగాళ్ళ మీద కూర్చున్నాడు. కలం, కాయిదం సిరంజి పెట్టుకొని బతుకుడు కాదు రైతు బతుకు. తమ్ముని ముఖంలోకి చూశాడు. ఎముకలు తేలి తనకన్న పదేండ్లు పెద్దవాడుగా కన్పిస్తున్నాడు. వాడు పదో తరగతి చదివి ఆగిపోయాడు, తలలో వెంట్రుకలు నరుస్తున్నాయి.

లక్ష్మి రాజుం పొలం దొయ్యదొయ్య తిరిగి చూశాడు. అది కనీసం ఏ నూరోసారో? ఎన్ని రకాలుగా చూసినా ధైర్యం చాలడం లేదు.

లక్ష్మి రాజుం పొలమంతా తిరిగి వచ్చి దొయ్యలో కూలబడి ఒక గరిక పోసను తెంపి నోట్లో పెట్టుకొని "అన్నా బతికేది నాలురాలే - పంటలు సూడ పోతే గిట్ల - మీదికెల్లి ఊళ్ళల్లలొల్లులు. ఎనుకటి తీర్గలేదు ఊళ్ళె బతుకు - ఎవసాయంల కర్సు పెరిగింది. మందులు మాకులు" గురగురలాడే గొంతుతో.

"పోనీ నా దగ్గిరికి రారాదురా. మెడికల్ షాపు పెట్టిస్తా" నాగేంద్రం.

"మీ మరదలు ఆదే అంటంది. కని అన్న - మీరంత సదువుకున్నారు. బయటపడ్డరు. నేను ఎటన్న పోదలుసుకుంటే పోదును. నేను ఎటూ పోలేను. ఈ భూమి, ఇల్లు, అవ్వ - నాయిన్న విలుసున్నా కూసున్నా - ఈ పొలాలల్ల నాతో నాయిన్న మాట్లాడుతున్నట్టే వుంటుంది. ఈ వూరు విడిసి రాలేను. అచ్చి బతుక లేనన్న" లక్ష్మి రాజుం ఎందుకనో వెక్కి వెక్కి ఏడిచాడు, కళ్ళ సీళ్ళ బెట్టినాడు.

నాగేంద్రంకు గుబగుబ కళ్ళల్లో సీళ్ళూరినాయి నాగేంద్రంకు గొంతు పెకలలేదు.

లక్ష్మి రాజుం తేరుకొని "ఇయ్యాల్ల వూళ్ళోల్లు మండలాఫీసుకు పోయిండ్లు. అన్నుంచి జిల్లా దాకా సుతపోతరట - మండలాఫ్సెచ్చన్ని 'సెరువు గండి మూపిత్తవా సత్తవా' అంట అడుగుతురట. నేను పోయేదే ఉండే నువ్వు రాక రాక వత్తివని...." లేచి నిలబడి.

ఇద్దరూ ఎవరి ఆలోచనలు వాళ్ళు చేస్తూ కట్టెక్కారు.

నాగేంద్రంకు ఆయాసమొచ్చింది.

కట్ట మీది నుంచి తనండ్లో తాను మాట్లాడుకుంటూ, ఎర్రగా కమిరి పోయిన మనిషిలాగావున్న మనిషి నాగలి కొడారేసుకొని రావడం కన్పించింది.

"లాలయ్యమామ" లక్ష్మి రాజుం.

నాగేంద్రం నిలబడిపోయాడు.

"లాలు మామా, మా నాగన్ననే" లక్ష్మిరాజుం.

ముల్లుకర్ర భుజాలమీద పెట్టుకొని నిట్టనిలువుగా నిలబడి నాగేంద్రంను చూశాడు. లాలయ్య పీక్కుపోయిన దవడలు వనికాయి. చిన్న కండ్లల్లో కోపం. "గీ దునియల సదువుకున్నోల్లంత లంగలు లేరు" తుప్పుక్కున ఊంచి వెళ్ళిపోయాడు.

నాగేంద్రం తేరుకోలేదు. లక్ష్మిరాజం "దా అన్నా పోదాం" ముందు దారి తీశాడు.

కొంత దూరం నడిచిన తరువాత " అన్నా గంగు మతికున్నదా?" అని లక్ష్మిరాజం అడిగాడు.

నాగేంద్రం మాట్లాడలేదు. గంగ నాగేంద్రం అనుబంధం లక్ష్మిరాజుంకు తెలుసు.

"గంగ ఉరిబెట్టుక సచ్చిపోయింది" లక్ష్మిరాజుం.

నాగేంద్రం సలిపిడుగు మీద పడ్డట్లుగా వనికిపోయాడు.

లక్ష్మిరాజుం వెనక్కి తిరిగి నాగేంద్రం కళ్ళల్లోకి ఒక నిమిషం చూసి తల వంచుకొని "ఔనన్న.... ఇంక ఆరం దినాలకు సనిపోతననంగ మనూరి కచ్చింది. నా కోసం మనింటికచ్చిందట నేను లేను. ఆఖరుకు కుమ్మరోల్ల సింత కింద కల్సింది. అయిదేండ్లో పదేండ్లో నాతోని ఎప్పుడూ సరిగ మాట్లాడలే - కోపం గావచ్చు ననుకున్న 'బాగున్నవ మరిదీ' అన్నది. అన్నా ఆ గొంతు ఎంత ఆప్యాయంగ వున్నదని. నా పంకలున్న చిన్నోన్ని తీసుకొని ఎత్తుకొని ముద్దులాడింది. 'మీ అన్న కెందరు పిల్లలన్నగి?' నేను చెప్పిన - 'ఏడున్నడు? ఎంత సంపాయిత్తండు? మీ వదినె ఏం సదువుకున్నది?' అడిగింది. నువువున్న ఊరు చెప్పిన - మిగతా నాకు ఎర్కలేదన్న. 'డాక్టరంటివి గదా? బాగానే సంపాయిత్తండు భారిత్తు బాగుంటదా?' అన్నది. నేను నేల చూపులు చూసుకుంట మాట్లాడలే - 'పిల్లగా! మా ఈడోల్లందరి బతుకులు కిందికో మీదికో బాగనే వున్నయి. నేను ఏం బతుకు అడుక్కచ్చుకున్ననో?' ఈ మాటతో పాటే బొటబొట కన్నీళ్ళు కారినయ్. కొంగుతోని కండ్లు తుడుచుకొని 'అందరికీ పైసలు గావాలె - మనుషులక్కర లేదు మీ అన్నకు గంతే- మీ అన్నేంది సదువుకున్నోల్లంత గంతే' సానసేపు పెద్దక్క తీర్గ మాట్లాడింది. చిన్ననాటి సంగతులు చెప్పుకచ్చింది నా ఎనుకనే ఇంటికచ్చి అవ్వ దగ్గర కూకుండి 'అత్తా నాకు జనుపతాడు పెట్టి జెడ లెయ్యవానె' అన్నది. అవ్వ పక్కలో కూకుండి సానాసేపు ముచ్చటబెట్టింది."

నాగేంద్రం కళ్లల్లో నీళ్ళు. "గంగ మొగుడు ఏదనో పోలీసుల్ల పనిజేత్త దట - రోజు తాగుడేనట, రోజు తన్నుడేనట. పోనీ కయికిలో కూలో జేసుక బతుకుదామంటె ఏడుంటది? తల్లిగారు లేమిడోల్లేనాయె."

లక్ష్మంరాజం చెప్పుకపోతున్నాడు. కాని నాగేంద్రంలో సంపూర్ణంగా గంగ రూపం జ్ఞాపకాలు నిండిపోయి ఏ మాటా విన్పించడంలేదు.

* * *

ఎవరిదో ఎడ్ల బండి మీద సాయంకాలం నాగేంద్రం వదిన సావిత్రి, పిల్లలు రమణ, రమేష్ వచ్చారు.

సావిత్రి రాకడతోనే లసుమవ్వ మీద పడి ఏడ్చింది. మనిషి పూర్తిగా ఎండిపోయింది. సడలిపోయి వున్నది. పిల్లల చదువుల కోసం ప్రైవేటు స్కూల్లో నెలకు అయిదు వందల జీతం మీద టీచర్‌గా పని చేస్తున్నది.

రమణ ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చదువుతోంది. రమేష్ ఎస్.ఎస్.సి. చదువుతున్నాడు రమణకు ఎట్లాగన్నా పెళ్ళి చెయ్యాలన్నదే సావిత్రి దిగులు.

"చిన్నాన్న - అమ్మ చూడు - నాకేమొ నీలాగా డాక్టర్ చదువాలని వున్నది" రమణ.

"మనం ముగ్గురం బతకడమే కష్టం గదే - నువ్వయినా చెప్పు డాక్టర్ చదవడమంటే మాటలా?" సావిత్రి కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ.

నాగేంద్రంకు తను ఇంటర్ ఫైనల్ పాసైన రోజు జ్ఞాపకం వచ్చింది. ఫస్టు క్లాసులో పాసయ్యాడు. చేతిలో నయాపైస లేదు. తండ్రి లేడు. అప్పటికే లక్ష్మరాజం చదువు మానేసి వ్యవసాయం చేస్తున్నాడు. రమణలాగే అమాయకంగా తను డాక్టర్ చదువుతా ననుకున్నాడు.

లసుమవ్వకు ఆ చదువేమిటో సరిగ్గా తెలియదు. తమ్మునిలాగే ఏదన్న పని చేసుక బతుకుమంటూ తిట్టిపోసింది. ఆ రోజంతా తిండి మానేసి దాదాపు పదిహేను కిలోమీటర్లు నడిచి ఫారెస్టర్‌గా పని చేస్తున్న అన్న దగ్గరికి పోయాడు.

అన్న ఆ దుమ్ము నిండిన కాళ్ళు, ముఖం చూసి కోప్పడి స్నానం చేయమని "అట్లాగే సదువుకునేవులేరా?" అన్నాడు. తనకు నమ్మకం చిక్కలేదు. తను దిగులుగా వుంటే ఆ రాత్రి గొంతెత్తి "చెల్లియో చెల్లకో" అన్న పద్యం పాడాడు.

నాగేంద్రంకు అన్నయ్య ముఖం జ్ఞాపకం వచ్చింది. అన్నయ్య తనకు తాహతుకు మించిన పనైనా తనను చదివించడానికి ఒప్పుకున్నాడు. ఆ రాత్రి తన మూలకంగా అన్న వదినలు కొట్టుకున్నారు.

తనకు మెడిసిన్‌లో సీటొచ్చింది. తన చదువుకు డబ్బు పంపడానికి అన్న పడని కష్టాలు లేవు.

తను డాక్టర్ పట్టా పుచ్చుకొని అన్న దగ్గరికి వచ్చి "అన్న మన కష్టాలు కడతేరినయన్న" అన్నాడు.

"నాగన్న నువ్వు నాకు నా పిల్లలకేదో చేస్తవని నేను చదివించలేదుర. ఆ లెక్కన నేను నీకు పంపిన వందా రెండు వందలు నీ చదువు కేమూలకు సరిపోయినయ్. నువ్వు చాలెంజ్‌గా తీసుకొని డాక్టర్ వైనావు" అన్నాడు.

ఇప్పుడు తన అన్నకన్నా దాదాపు పది పదిహేను రెట్లు సంపాదిస్తున్నాడు. రోగులను పీక్కొని తినదలిస్తే ఇంకా ఎక్కువే సంపాదించవచ్చు. కాని అన్నలాగా స్వచ్ఛంగా, నిర్మలంగా వుండలేకపోతున్నాడు. అన్న పదినతో కొట్లాడి తనను చదివించాడు. కనీసం చనిపోయిన అన్న పిల్లలిద్దరినైనా తన దగ్గరుంచుకొని చదివించలేకపోతున్నాడు. పిల్లలను చదివించడం ఆర్థికంగా తనకు పెద్ద కష్టమేమి కాదు. కాని తన దగ్గర పిల్లలను వుంచుకోలేడు. అన్న చనిపోయేదాకా తన కిష్టమైన పద్ధతిలో బతికాడు. కాని తను తనకు నచ్చిన పద్ధతిలో బతుకలేడు.

పిల్లల బాగోగులు చూడ నోచుకోనందుకు కాసేపు భర్తను తలుచుకొని - ఇంతమందిని విడిచిపోయినందుకు పెద్ద కొడుకును తలుచుకొని లసుమవ్వ ఏడ్చింది.

అందరు పడుకోవడానికి ఇంట్లో స్థలం లేక నాగేంద్రంకు వాకిట్లో పందిరి కింద మంచం వేశారు. పోశాలు నాగేంద్రం పక్కలో పడుకున్నాడు

రాత్రి ఊరులుకు మగ్గిపోయింది. ఆకాశంలో చుక్కలు. మధ్యలో చంద్రుడు. దూదిపింజాల్లా చందమామతో దోబూచులాడుతూ సాగిపోయే మబ్బులు. అలవాటులేని నిశబ్దం. ఆ నిశబ్దంలో నేపధ్యంగా ఎడతెగని చిమ్మెట్ల రొద. పైగా దోమలు. కప్పుకోవడానికి ఇచ్చిన శద్దరు ముక్క వాసన వేస్తోంది.

ఇంట్లో అందరు పడుకున్నారు. ఎడ్ల కొట్టంలో ఎడ్లు పచ్చగట్టి నములుతున్నాయి.

నాగేంద్రంకు నిదుర రావడంలేదు. పక్కలో వెచ్చగా పోశాలు శరీరం. నిదురలోనే 'కాసుల' ననుకరిస్తూ "కార్ర్" అంటున్నాడు.

పోశాలు మీద శద్దర్ కప్పి వాకిట్లో పచారు చేయసాగిండు. కలగా పులగ మైన జ్ఞాపకాలు ఒకటొకటే విచ్చుకుంటున్నాయి.

ఎండాకాలం ఇండ్లకు దూరంగా వేసే కొడార్లు, పుచ్చపువ్వు లాంటి వెన్నెల రాత్రులు, కోలాటం. 'అడుజై శివ శివ మూర్తివయ్య గణనాథా, నువ్వు శివుని కుమారుడావు గణనాథా – 'సిల్లాకు బొయ్యేటి ఓ సీలవేణిరో? నిలుచుండవే గొల్లభామా? నీ తోని పని గలిగేలేమా?' 'పని పని యాని నన్ను....' పాట ఆగిపోయింది. కోలం చప్పుడు నిలిచిపోయింది. తెల్ల జొన్న కర్రలు పైర గాలికి ఊగుతుండగా మంచె మీద గంగ. తను విచ్చెన మీద.

గంగ పెళ్ళైపోయింది. అత్తగారింటికి తీసుకపోవడానికి మామ బండి కట్టుకొని వచ్చిండు. రేపే ప్రయాణం.

"గంగా ..." తను.

"నీను పోను బావా? నన్ను నీతోని తీసుకపొతావా?" గంగ వెక్కి వెక్కి ఏడుస్తూ అభ్యర్థిస్తున్నది.

"ఏడువకు గంగా!" నాగేంద్రం మంచె మీదికి ఎక్కాడు.

గంగ నాగేంద్రం మీదబడి కుమిలి కుమిలి ఏడ్చింది.

"గంగా! నాకింక రెండేండ్ల సదువున్నది. నేనే ఓ పూట తిని, తినక సదువుతున్న"

"అప్పటికి నీ గంగ ఇద్దరు బిడ్డల తల్లయితది" గంగ నాగేంద్రంను దూరంగా తోసి.

నాగేంద్రం ముఖం ముడ్చుకొని మంచె దిగి చేనులో కోపంగా నడుస్తున్నాడు,

వెనుక గంగ అడుగుల చప్పుడు. నాగేంద్రంను ఆపి "మనిద్దరం కూడు కున్నమని ఊరు కోడైకూత్తంది "

తను గంగ ముఖంలోకి చూడలేదు. గంగ కన్నీళ్ళు తుడవలేదు.

"నీకు మనుషులద్దు – నీకు సదువు గావాలె– పెద్ద పదవిగావాలె పైసలు గావాలె" ఏడుస్తూ కూలబడిపోయింది.

నాగేంద్రం ఆ జ్ఞాపకాలను తుడిచివేయడానికి మళ్లీ పచారు చేశాడు. వాకిట్లో నుంచి వీధిలోకి – వీధిలో చింతకింద నిలుచున్నాడు.

"బావా?" చెవులో గుసగుసగా–

నాగేంద్రం ఆ పిలుపు నుండి తప్పుకోవడానికి మరి కొంత దూరం నడిచాడు. షావుకారిల్లు – కుమ్మరోల్ల, చింత చెట్టు – కాటిపాపలోల్లు కడుపుల నుంచి

గుండ్లు తియ్యడం - పెద్ద బొనుగూ పడం - గారిడివాని డోలు చప్పుడు - పెద్దమ్మలది డోలు గిరడం - గంగెద్లవాని సన్నాయిపీకా పోటెత్తాయి.

నాగేంద్రం చింత మొదట్లో కూలబడిపోయాడు కుక్కలు ఎక్కన్నో బలహీనంగా మొరుగుతున్నాయి. మేర ముసలవ్వ గొంతెత్తి పాడే వాన దేవుని పాట వినిపిస్తున్నట్టుగానే వున్నది. నాగేంద్రం గంగ జ్ఞాపకాలు పారదోలడానికి - గంగ నుంచి దూరంగా పరుగెత్తుతున్నాడు.

వానకాలం గుర్తుకు తెచ్చుకున్నాడు. ఎండకాలం గాడుపుదుమారాలు - బండి మీద ఎరువు జారగొట్టడం - బాజా బజంత్రీలు - పెండ్లిల్లు పెండ్లి కోసం ఎడ్ల బండ్లు - పై బట్టడం - జిపజిప వానలు కురుస్తుంటే తడవడం - ఆరుద్ర పురుగులు, ఊసిల్లు - మడికట్టు పొలాలు దున్నడం - పరిగొయ్యల్లో ఎంద్రికాయలవేట - డిబడిబలాడే చెరువులు ఆకివిలో చిసురు జేకుటాకుల మీద వాన మోత-

వానలు తగ్గగానే బీరపూల పసపుదనం - బొడ్డెమ్మ ఆట, ఒక్కేసి పువ్వేసి సందమారు ఒక్క జాములాయె సందమామ అవ్వ బతుకమ్మకు దూరంగా నిలబడి పాడేది. ఆ పాటకు మొదలెక్కడో తుది ఎక్కడో తనకు తెలిసేదికాదు. దసరా పండుగ, కొత్త బట్టలు సద్దుల బతుకమ్మ కోసం అర్ధరాత్రి గుమ్మడి, తంగేడు పూల వేట - రెడ్డోరి కొట్టాల దగ్గర విశాలమైన మైదానంలో బతుకమ్మ ఆట.

సత్తు ముద్దులు. 'పాపిడి కాయలు' కంక గొట్టాల్లో వేసి ఆడోల్లను కొట్టడం వాళ్ళు ముది గారువంగా తిట్టడం. దసురకు జంబికి పోవడం. జంబి దగ్గర మేక పిల్లలను నరుకుడు. జంబాకు ఊరోల్లందరికి పెట్టి కాళ్ళు మొక్కడం. గరత్మంతుడు పాల పిట్ట. నల్ల పిట్టను చూడడం.

దీపావళికి కోమటోల్లు కాల్చే పటాసులు, చిచ్చుబుడ్లు - వాకిట్లో రోకలి మీద పెట్టిన గండసిలుక దీపం. అది అటూ ఇటూ ఊగుతుంటే అవ్వ కొంగు కింద దాక్కోవడం. వరి కోతలు, బంతులు చల్లికాలం ఆరి కంట్లాలు. చలి నెగల్లు, నెగడి కాడ నిదురరాని ముసలివాళ్ళు చెప్పే రాజుల రాణుల కథలు - బంగారు లాటి ఎండపొద.

ఇట్లా అనేక జ్ఞాపకాలు పోటెత్తాయి. తను ఒక సామూహిక జీవన సంరంభంలో బతికిన బతుకది. ఊరందరికి వరసలే. ఏ కులం వాళ్ళయినా? ఊరి కష్టసుఖాలు అందరివి. అందరి కష్టసుఖాలు ఊరివి

తను ఇప్పుడు నాగేంద్రం ఎం డి. పెద్ద డాక్టరే. రోగులు, మందులు, ఆపరేషన్లు, ఏడుపులు, పెడబొబ్బలు ... వీటన్నిటితో తనకు ఏలాంటి సంబంధ మున్నది? తను డాక్టరు వృత్తిలో ఒంటరే- ఏ డాక్టరు ఏ రోగాన్ని తగ్గించ లేదు. తగ్గించగలనన్నట్టు నటిస్తాడంతే- అనేక రోగాల మూలాలు రోగి శరీ రంలో మాత్రమే, లేవు అని చాలా వరకు సామాజికమైనవి.

మొత్తంగా ఈ ఊపిరి శబ్ద ప్రపంచంలో నుంచి - బీర తీగలా అల్లుక పోయిన సంబంధాల నుంచి విడిపోయాడు. ఈ ఊళ్లో పాత తరం గౌరవించి నట్లు మాట వరసకు పలుకరించింది. కొత్తతరం గుర్తేపట్టలేదు. ఈ ఊరికి తను పరాయివాడు ఎవరికి ఏమి కాడు.

మళ్ళీ గంగ జ్ఞాపకం వచ్చింది గంగ తన బతుకు చెడగొట్టుకున్నది. తను చెడగొట్టలేదా? గంగను చంపింది ఎవరు? తనేనా?

నాగేంద్రం లేచి నిలుచున్నాడు. కాళ్ళు వనికాయి ... అవ్వకు, తమ్ము నికి, పిల్లలకు తనేమి కాడు. వాళ్ళ గురించి ఏ రిస్కు తీసుకోలేడు.

స్పష్టంగా ఏదో తెలిసోయినట్లనిపించింది, ఈ మట్టి వాసనల నుంచి తల్లి వేరు బంధాల నుంచి వేరు చేసిందెవరు? చదువే...

లుకలుకలాడే పాత ఇల్లు భల్లున కూలిపోయినట్లనిపించింది. చదువు మీద కసి లేకుంటే - కసి నుంచి పుట్టిన విశ్వాసం లాంటిదేదో లేకుంటే ఇంత దాకా రాకపోవును. ఒక నిశ్వాసలాగా కమ్మేసింవది

తను డాక్టరు కోర్సులో మూడవ సంవత్సరం చదువుతుండగానే తన కాళ్ళ కింద నేల గురించి ఆలోచించడం ప్రారంభమైంది. రెండు ఎదురు బొదురు ప్రపంచాల గురించి తెలుసుకున్న దక్కడే. తను ఉచ్చులో చిక్కుకొని పరాయీ కరణ చెందుతున్నట్లుగా అస్పష్టంగా అర్థమవసాగింది. ఈ ఉచ్చు బలీయమైన దని గుర్తించిన వాళ్ళు చాలా మంది మానవ రిలేషన్ వెతుక్కుంటూ వెళ్ళిపో యారు. అప్పుడు ఈ ఉచ్చు అంత బలీయమైంది కాదని తను వాదించాడు. డాక్టరై సేవలు చేద్దామనుకున్నాడు. డాక్టరుకు, ప్రజలతో కలిసిపోవడానికి ఎలాంటి సంబంధం లేదని స్పష్టంగానే అర్థమయ్యింది కాని తనలో ఇంత లోతుగా తొలుచుకు పోయిందని మాత్రం తెలియదు. నిన్నటిదాకా తనింకా తన వాళ్ళతో పల్లెతో మమేకమై వున్నాననుకున్నాడు. అది వాస్తవం కాదని తన్ను తాను మభ్యపెట్టుకుంటున్నాడని తేలిపోయింది.

నాగేంద్రంకు తన స్థితేమిటో సంపూర్ణంగా అర్థమైపోయింది. తిరిగి వచ్చి పోశాలు పక్కలో పడుకున్నాడు. హౌజ్ సర్జన్ చేస్తూ చుట్టుపక్క గ్రామాలల్లో

ప్రజలను కలుస్తున్నాడని వాళ్ళకు బతకడం బోధిస్తున్నాడని పట్టుకపోయి వెన్నెముక విరిగేదాక చిత్రహింసలు పెట్టినా కూడా ధైర్యంగా వున్న దేవిడ్-ఎం.డి లో సీటొచ్చినా వొదిలిపెట్టి ఎటో వెళ్ళిపోయిన శ్రీనివాస్ - తను డాక్టరై వుండి గుండె జబ్బుకు వైద్యం లేక ఎక్కడో కుగ్రామంలో చనిపోయిన బాబు జ్ఞాపకం వచ్చారు.

"చట్.... కూరుక పోయింది వాస్తవమే. బయటపడే మార్గం లేదా? రిస్కు వుంటుంది? రిస్కు తీసుకోవాలి? జరుగబోయే బతుకులో తను విలబడాలి?" ఈ ఆలోచన కొత్తగా వింతగా తోచింది.

గాలి విసురుకు మబ్బులన్నీ విడిపోయినట్లుగా జ్ఞాపకాలన్నీ తొలిగిపోయి నట్లుగా అన్పించింది.

"ఏదన్నాగాని అవ్వను తీసుకపోతా" అనుకున్నాడు. నాగేంద్రంకు అప్పుడు విదుర పట్టింది.

* * *

తొలికోడి కూసింది. నాగేంద్రంకు హఠాత్తుగా మెలుకవ వచ్చింది. నల్ల పిట్టలు పీచుపీచు మంటున్నాయి.

మరదలు లేచి బరుకూ బరుకున వాకిలి ఊడ్వసాగింది.

నాగేంద్రం మంచంలో లేచి కూర్చున్నాడు. అప్పటికే లక్ష్మి రాజం వాకిట్లో కొచ్చాడు.

"నేను వెళ్ళిపోతరా తమ్మీ!" నాగేంద్రం.

"అప్పుడే నానే - మూడు దినాలు వుంటనంటివి గాదే" లక్ష్మిరాజం.

"ఉందామనే వచ్చినరా? ఇప్పుడుండలేను. నా మెదడంతా కోళ్లు దవ్విన పెంటైపోయింది. సఘుర్ క నాఘాట్ క" నాగేంద్రం కంఠం పూడుకపోయింది.

మరదలు అందరిని లేపింది. రమణ కళ్ళు నులుపుకుంటూ వచ్చి నాగేంద్రం పక్కనే కూర్చున్నది సావిత్రి దూరంగా నిలుచున్నది. లసుమవ్వ మంచంకు ఎదురుగా కొట్టంలో కూర్చున్నది.

నాగేంద్రం రమణ తల నిమురుతూ "అవ్వా! మీ నాయిన అష్టకష్టాలు పడి నను చదివిచ్చిండే రమణా! నేను నిన్ను చదివియ్యలేను. ఆ చదువు నువ్వు అనుకున్నంత గొప్పదిగాదు. అవ్వా! నన్ను మన్నించు" అన్నాడు

"అయ్యేం మాటలు పిలగా!" సావిత్రి కదిలిపోయి.

"వదినా! మీకు ఎవరికీ అర్థం కాదు వదినా? మీరంతా ఒకరితో ఒకరికి అందరికి ఊరితో పిల్ల పేగు సంబంధం తెగిపోనోల్లు. ఎందుకంటే మీరు నా

తీర్గ పెద్ద చదువులు చదువలేదు. తమ్మి రమణకు మంచి సంబంధం చూడండ్లి - పెళ్ళి ఖర్చు నేను పెడత"

పోశాలును, రమేష్‌ను చెరో చంకలోకి తీసుకొని మాటలు రాక తలలు నిమిరిండు.

బ్రీఫ్ కేసు తెచ్చిండు. మరదలు దీపం ముట్టించింది.

నాగేంద్రం మూడు వేల రూపాయిలు తీసి లక్ష్మిరాజుం కిచ్చి "మొదలు పొలం బాగు చేయించు. తర్వాత మరికొంత పంపుతా"

లసుమవ్వ ఆగలేక పోయింది. పునుక్కుంట నాగేంద్రం దగ్గరికి వచ్చింది.

"అవ్వా! నువ్వు తయారుకా - నాతో పాటు తీసుకపోతా"

ఆ మాటకు లసుమవ్వ కదిలిపోయింది. లసుమవ్వకు ఎక్కడో గుర్రు వుండేది. ఆ మాటతో తల్లి మనసు కరిగి పోయింది.

"నాయిన నాగేంద్ర - మా వత్తరా? నీకేం కష్టం కలుగుతందిరా నాకు చెప్పరా?" అన్నది ఏడుపు గొంతుతో.

నాగేంద్రంకు బుసబుస దుఃఖం పొంగింది. ఆ దుఃఖం ఎన్నేండ్ల సుంది ఘనీభవించిందో జాతరలో తప్పిపోయిన పిల్లవాడు హఠాత్తుగా తల్లిని చూసిన ట్లుగా తల్లి మీద పడి వెక్కి వెక్కి ఏడ్చాడు.

లసుమవ్వ తనూ ఏడుస్తూ తన జిగిసచ్చిన చేతులతో ఒళ్ళంతా పునికింది. "కానరాని దేశంలుంటివి బిడ్డా! నీ కట్టం తెలువకపాయె. సుకం తెలువకపాయె బిడ్డా!" లసుమవ్వ.

నాగేంద్రం చాలా సేపు ఏడ్చి బరువంతా తీరిపోయి కళ్ళు తుడుచుకు కున్నాడు. అప్పటికి పిల్లలు, వదినె, మరదలు, తమ్ముడు అందరు ఏడుస్తు న్నారు.

"ఎందుకేడుత్తుండ్లురా? లచ్చన్నా బండితేపో - మీరందర్ని తీసుకపోత- సెలవులకు వచ్చేరు అవ్వా! నువ్వు తయారుగావే" అన్నాడు ఏమి ఎరుగనట్లే చిన్న పిల్లగాన్ని తీసుకొని ముద్దులాడాడు.

లసుమవ్వ తేరుకొని "నాగన్న నువ్వు బాగుంటే అదే పది వేలు. నాయినా! కోడలను ఏమనకు. మల్లి నెలకు రాండ్లి. నేను సుతమీ ఎంటత్త- ఇప్పుడు పనుల దెవుసం - సెరువట్ల వున్నది. బిడ్డా! నాగన్న నేను ఏకాడికి రాపోతే ఏడికి పోతరా?" అన్నది.

"వదినా! మల్లచ్చినప్పుడు సెలవులు సూసుకొని అందరు రావాలె" నాగేంద్రం.

"మా వస్తం" సావిత్రి.

"నేనత్త చిన్నాయిన" రమణ.

"సరే నడుపే"

"వద్దే. దసర సెలవులకు పోయేవు. నీ చదువో?" సావిత్రి.

"సరేనమ్మా దసర సెలవులకు నేను వచ్చి తీసుక పోతకదా!" నాగేంద్రం.

లక్ష్మి రాజం బండి కట్టుక వచ్చాడు.

పోశాలు అందరికన్నా ముందే బండెక్కి కూర్చున్నాడు.

వాడి తల్లి వచ్చి "పనులదెవుసం - నాయిన్న సెరువు పనికి పోతే ఎడ్లు ఎవలుకాయాలెరా? అక్క పోయినప్పుడు పోయేవు"

పోశాలు కాళ్ళు నేలకేసి కొడుతూ ఏడుస్తున్నాడు. నాగేంద్రం బండెక్కాడు. నడి ఊళ్ళెదాక అందరు సాగసంపుతూ వచ్చారు. అందరి దగ్గర సెలవు తీసుకున్నాడు.

బండి ఊరి బయటకొచ్చింది. తూర్పు దిక్కు ఏగిలివారుతోంది. బండి గీరెలు కరకరలాడుతున్నాయి. బండి ముందు ఎవరో పరుగెత్తుతున్నారు, కొంత దూరం పోయిన తర్వాత తెలిసింది పరుగెత్తేది పోశాలని.

"ఓరి నీ కడుపున అంబలి బొయ్య" లక్ష్మిరాజం.

"పోశన్న రారా! బండెక్కు" నాగేంద్రం.

పోశాలు బండి మీద కెక్కాడు. "మీ అవ్వ పరిషాసైతదిరా?" లక్ష్మిరాజం.

"పోనీయ్‌రా? నేను బస్సు ఎక్కే కాడికి వస్తడు. ఎవరన్న కలిస్తే ఇంటికి చెప్పి పంపుదాం" నాగేంద్రం.

బండి నడుస్తుండగా "అన్నా! నేను నీకు చెప్పేటోన్ని కాను. నువ్వు పల్లె సర్గమనుకుంటున్నవ్. కాని ఈడ పల్లెలు మునుపటి తీర్గలేవ్" లక్ష్మిరాజం.

"లెవ్వు నిజమే"

"సత్తె నాశనం అయిపోయినయ్ నువ్వు గది చూడలే?"

"లచ్చన్నా అది సత్తె నాశనం కాదు. పెనుగులాట - పోనీ నువ్వు నా దగ్గరికి రా! మందుల దుకాణం పెడుదాం" నాగేంద్రం.

లక్ష్మిరాజం తత్తరపడ్డాడు.

"నువ్వు రావు. నువ్వే కాదు. ఏ రైతుమెడలు బట్టి దొబ్బేదాక ఊరు నిడువలేదు నువ్వు నాలాగా పెద్ద చదువులు చదువుకోలేదు. చదువు మంచిదని చదువుకుంటె సర్వం తెలుస్తదని చెప్పుతరు. నాకు అర్థమైనంత వరకు నేను అనుభవించినంత వరకు చదువంటే సృష్టికర్తలైన మనుషుల నుండి కొంత మందిని వేరు చేసి శిక్షణ ఇవ్వడం. అప్పుడు రైతు బిడ్డడు, కార్మికుని కొడుకు తల్లి పేగు సంబంధం తెంపుకొని ప్రభుత్వంగ మారతాడు. తన తండ్రి మీదికే తన బంధువుల మీదికే అధికారిగా వస్తాడు. మాయ జేస్తాడు. చదువు చెప్పే పంతులుగా మందులిచ్చే డాక్టర్‌గా, తగువులు పెంచే వకీలుగా, జడ్జిగా, పోలీసాఫీసర్‌గా, మంత్రిగా, ఎం.ఎల్ ఏ.గా ఎన్నయినా అవుతాడు. మనలాంటి దేశాలల్లోనైతే సకల అధికారాలకు, దోడిడీకి ఈ చదువుకున్న వాళ్ళే మధ్య వర్తులు. గవర్నమెంటు భాషలో చెప్పాలంటే వీళ్ళే యంత్రాంగం. నాగేంద్రంకు ఇంకా బాగా చెప్ప రావడం లేదు.

బండి నడుస్తోంది. పోశాలుకు వీళ్ళిద్దరేం మాట్లాడుతున్నారో తెలియడం లేదు. అతనికి పెదనాన్నతో పాటు ఊరికి పోతనని ఉత్సాహంగా వున్నది.

తూర్పున సూర్యోదయాన్ని తెలుపుతూ ఎర్ర దౌలు ఆకాశమంతా పాకుతున్నది.

## కొత్త చదువు

అలలు దిద్దుకునే వయసులో అనుకున్నా
కాగితం పడవనై వానలో తడిసి
నీటివాలులో జారిపోవాలని
నూనూగు మీసాల వయసులో
నెచ్చెలి గజ్జెల సవ్వడిని
పిల్లనగ్రోవిలో పలికించాలని తలపోసా
శాంతి కపోతపు గాయాలకి
శీతలోపచారాలు చేయాలని తహతహలాడా
ఈనాడే నిజం తెల్సుకున్నా
నవతరానికి నాందిగ నా వంతుగా
మళ్ళీ బాల్యాన్ని అలలు దిద్దిస్తున్నా బోయినెట్లతో!

—మేఘశ్యామ్

# విశ్వనాథ సాహిత్యం - మత, కుల విషం

—త్రిపురనేని మధుసూదనరావు

## నవ్య సంప్రదాయం - గాలిమేడకి నీటి స్తంభాలు

జి.వి.యస్. వికృత ఊహాలోకంలో నవ్య సంప్రదాయం అనే ఒక గాలి మేడ కట్టాడుగదా! అది కూలిపడి ఊహావిచిత్రం భగ్నం కాకుండా ఉండటం కోసం నీళ్ళతో స్తంభాలు కట్టాడు. ఇదంతా ఒక కుటిల క్రీడ. నిర్వచనం ఇవ్వడంలోనూ, స్వరూప నిర్ణయంలోనూ మాటల మాయాజాలంతో కొందరినైనా మోసగించవచ్చు. కానీ తప్పుడు లక్షణాలు చెప్పి ఎవరూ ఎవర్నీ నమ్మించలేరు. మతవర్గ తత్వాన్ని రెచ్చగొట్టడానికి, కులతత్త్వ విషం కురిపించటానికి సాహిత్య ముఠా ఒకటి పొంచి ఉండి పాత కత్తుల్ని కొత్తగా నూరుతోంది. ఇదో కాషాయ రాక్షస బృందం. ఈ బృంద కోశాధికారి జి.వి.యస్. నవ్యసంప్రదాయానికి నాలుగు కోణాలు ఉన్నాయట. ఒకటి సాంస్కృతిక కోణం. రెండు సామాజిక కోణం. మూడు తాత్త్విక కోణం. నాలుగు- కళాత్మక కోణం. సంఘ సంస్కరణోద్యమం నవ్యసంప్రదాయ సాంస్కృతిక కోణం అనీ, దానిని విశ్వనాథ ప్రారంభించి పోషించాడనీ జి.వి.యస్. వాదం. సాహిత్య విమర్శలో, శాస్త్రంలో పదాల్ని జనం ఏ అర్థంలో వాడుతున్నారో ఆ అర్థంలో వాడాలి. లేకపోతే ఇదిగో ఈ పదాల్ని ఈ ప్రత్యేకార్థంలో వాడుతున్నానని వివరణ ఇచ్చుకోవాలి. నిర్దిష్టత లేకపోతే స్పష్టత ఉండదు కానీ జి.వి యస్. అలా చెయ్యడు. ఎందుకని? వారిది దేశ కాలాతీత అతీంద్రియ దృష్టి. పైగా వారిలో ఇహలోక స్పర్శలేని శాశ్వతమైన ఆత్మ వెలుగుతూ ఉంటుంది. కర్మ, జ్ఞానేంద్రియాల్తో బతికే పామరుడికి వారి గుప్త భాషని అందుకునే శక్తి ఎలా ఉంటుంది? వారు బుద్ధి నుంచీ మాట్లాడితే మనకి అర్థం అవుతుంది. కానీ ఆత్మ నుంచీ మాట్లాడితే అర్థం కాదు గదా! జి.వి యస్. దేనిని సంఘ సంస్కరణోద్యమంగా భావిస్తున్నాడో, ఎవరిని సంఘ సంస్కర్తలుగా పరిగణిస్తున్నాడో తెలియదు. సాంస్కృతిక కోణంలో సంస్కృతి అంటే ఆయన దృష్టిలో అర్థం ఏమిటో తెలియదు. ఫలానా సంస్కర్తలు బోధించిన ఫలానా సంస్కరణలు విశ్వనాథ సాహిత్యంలో ఉన్నాయంటే చర్చ సులభం అవుతుంది. ఇలా నిర్దిష్టంగా చెప్పాలంటే కాస్త కృషీ, కొద్దిగా జ్ఞానం ఉండాలి.

అలాంటివి ఏమీ లేవు కాబట్టి అసలు చెప్పదలుచుకున్నవే అబద్ధాలు కాబట్టీ శుష్క అనిర్దిష్ట విలాపం చేశాడు.

సంఘ సంస్కరణోద్యమం గురించి ఆంధ్రపత్రికలో విపులంగానే రాసాను. వాస్తవానికి మన దేశంలోనూ, తృతీయ ప్రపంచ దేశాల్లోనూ వలస వాదుల పరిపాలనా కాలంలో వచ్చిన సంస్కరణోద్యమాల్ని గురించి కింద నుంచి పైదాకా సమగ్రమైన, సూక్ష్మమైన అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది. ఈ అధ్యయనాన్ని మార్క్స్, లెనిన్, మావోలు రూపొందించిన వైధానికాన్ని ఆయుధంగా చేసుకొని మార్క్సిస్టులు చేయవలసిందేకానీ మరొకరి వల్ల కాదు. ప్రాచీన సమాజాల్ని ఆరాధించే వాళ్ళు సంస్కరణల మీద శాస్త్రీయమైన అధ్యయనం ఎలా చేయగలుగుతారు? ఎందుకు చేస్తారు? బూర్జువా పండితులు కొందరు పరిశోధనలు చేశారు. ఆ పరిశోధనలు పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రయోజనాల పరిమితుల్లోనే జరిగాయి. ఇప్పుడు సంస్కరణ భావన ఎన్నో సంకీర్ణమైన అర్థాల్లో వ్యవహరించబడుతోంది. ఎన్ని అర్థాలు చెప్పినా సంస్కరణలు కొనసాగుతున్న, అమలులోకి వస్తున్న వ్యవస్థని పటుతరం చేసేవే కానీ వ్యవస్థని మార్చగలిగినవికావు. బూర్జువా వ్యవస్థ చట్రంలోనే ప్రజల అసహనాన్ని తగ్గించటానికి, ప్రజల విప్లవ పోరాటాల్ని తాత్కాలికంగా నిదానం చెయ్యటానికీ, తన మరణ శాసనాన్ని వాయిదా వేయించుకోవటానికీ బూర్జువా వర్గం సంస్కరణల్ని చేపడుతుంది. సంస్కరణలు విప్లవ శక్తుల వేగాన్ని మందగింపచేయటానికి ఆచరణలోకి వచ్చినా వాటికి ప్రగతిశీల స్వభావం ఉంటుంది. దేశ కాలాల్ని బట్టి సంస్కరణల అభ్యుదయ, అభ్యుదయ వ్యతిరేక స్వభావాల్ని విశ్లేషించాలి. ఉన్న వ్యవస్థని అంగీకరిస్తూనే ఆ సమాజంలో జీవశక్తిని నిరోధిస్తున్న, కాల దోషం పట్టిన సంస్థల్ని, ఆలోచనల్ని నచ్చ చెప్పటం ద్వారా, ప్రచారం ద్వారా చట్టబద్ధంగా నిర్మూలించటానికి చేసే ప్రయత్నం సంఘ సంస్కరణ. సంస్కర్తలు ఎవరూ పాలకవర్గాల్తో యుద్ధానికి దిగరు. పైగా పాలకవర్గాల్ని నమ్ముతారు. తన దోపిడీకి, అధికారానికి ఉపయోగపడే ఏ సాంఘిక సాంస్కృతిక అంశాల్ని అధికార వర్గాలు వదులుకోవు కనుక అంతిమంగా సంస్కర్తలు దోపిడీవర్గాల్తో వంచింపబడతారు. ఈ సంస్కరణలు కూడా విభిన్న రంగాల్లో విభిన్నంగా ఉంటాయి. భారత దేశంలో సంఘ సంస్కరణం పునరుజ్జీవనోద్యమంగా, పునరుద్ధరణోద్యమంగా, పాశ్చాత్యీకరణోద్యమంగా వచ్చింది. ఇందులో పాశ్చాత్యీకరణం కొద్ది కాలంలోనే విచ్ఛిన్నమై పునరుజ్జీవనోద్యమంలో కలిసిపోయింది. విద్య, మతం, స్త్రీ సంక్షేమం, నీతి, భాష, సాహిత్యం

మొదలైన సాంస్కృతిక రంగాల్లో పునరుజ్జీవన, పునరుద్ధరణ శక్తులకి సంఘర్షణ జరిగింది. పునరుద్ధరణవాదుల్లో కూడా మనుధర్మాన్ని పూర్తిగా సమర్థించినవాళ్ళు ఎవరూ లేరు. వివేకానందుడు లాటివాళ్ళు వర్గ ధర్మాన్ని సమర్థించారు. కానీ అస్పృశ్యతని తీవ్రంగా వ్యతిరేకించారు. సీత, అనసూయ వంటి పతివ్రతల్ని ఆదర్శ స్త్రీమూర్తులుగా చెప్పినప్పటికీ బాల్య వివాహాల్ని ఆమోదించలేదు. వితంతు పునర్వివాహాన్ని అంగీకరించారు. స్త్రీ విద్యని సమర్థించారు. బ్రాహ్మణాధిపత్యాన్ని, పురోహిత వ్యవస్థనీ నిరసించారు. పరమత సహనాన్ని ప్రదర్శించారు. ముఖ్యంగా దారిద్ర్యం పట్ల తీవ్ర ఆవేదన వ్యక్తంచేశారు. విశ్వనాథ పునరుద్ధరణ వాది కూడా కాదు. సంప్రదాయాన్ని మనువుకంటే బలంగా సమర్థించాడు. అసలు విశ్వనాథ సంస్కరణనే వ్యతిరేకించాడు. "సంస్కారములో సంప్రదాయములో నున్న భద్రత లేదు" (విశ్వనాథ చె క. 188) అని బానిసత్వానికి భద్రత అని ముద్దు పేరు పెట్టి సంస్కరణని నిరాకరించాడు. జి.వి.యస్.కి సంస్కరణని గురించీ తెలీదు. సంస్కృతిని గురించీ తెలీదు. విశ్వనాథ సాహిత్యం గురించీ తెలీదు. క్యాటలాగ్ పాండిత్యం తప్ప దేన్ని గురించీ తెలుసుకోవటానికి ఒక పుస్తకం అన్నా తెరిచి చూసినట్టు రుజువులేదు. "మన సాంస్కృతిక విలువల్ని పునర్విమర్శించుకొని, వాటిని అభినవంగా పునస్సృష్టి చేసుకునే యత్నం" (జి.వి యస్) ఏ సాంస్కృతిక విలువల్ని, ఏ సంఘ సంస్కర్తలు, ఎప్పుడు పునర్విమర్శించి అభినవంగా పునస్సృష్టి చేశారు? ఆ పునస్సృష్టిని విశ్వనాథ సాహిత్యంలో ఏ రచనల్లో చిత్రించాడు. వర్ణాలు ఉండాలి. వర్ణవివక్షణ ఉండకూడదనేది అభినవ పునస్సృష్టా? ఈ సృష్టిని విశ్వనాథ ఆమోదించలేదే? మతం జీవితానికి అనవసరమనీ, అవసరం అనుకుంటే పురాణాలూ, కర్మకాండ, మందిరాలూ విగ్రహాలూ అవసరంలేని తాత్త్విక మతం కావాలనీ సంస్కర్తలు చెప్పారు. విశ్వనాథ వీటిని అంగీకరించలేదే? సంస్కృత విద్యా విధానం స్థానంలో పాశ్చాత్య విద్యవిధానం కావాలన్నారే సంస్కర్తలు. విశ్వనాథ ఆధునిక విద్యని వ్యతిరేకించాడే? స్త్రీ జీవితం మీద మనువు విధించిన శాసనాలన్నిటినీ సంస్కర్తలు పూర్తిగా నిరాకరించగా, విశ్వనాథ పూర్తిగా సమర్థించాడే?

"హేతువాద దృష్టితో నిలువని విలువలను విమర్శించి సామాజిక, సాంస్కృతిక చైతన్యాన్ని పునర్వ్యవస్థీకరించటానికి ప్రయత్నించాయి కానీ సమూలవిచ్ఛేదనాన్ని కోరలేదు" (జి వి.యస్) ఆనాటి సామాజిక సాంస్కృతిక విలువల్లో హేతువాదానికి నిలిచేది ఒక్కటి లేదు. సంస్కర్తలు అన్నిటినీ విమ

ర్శించారు కులమతాలు, స్త్రీ పురుష సంబంధాలు, విద్యావిధానం, మూఢవిశ్వాసాలు, భాష, సాహిత్యం అన్నిటిలోని శిథిల సంస్కృతినీ ఖండించి వాటిలోకి కొత్తని ప్రవేశపెట్టి పునరుజ్జీవింప చేశారు. సంఘ సంస్కర్తలు పోరాడింది పునరుజ్జీవనంకోసం కానీ పునర్వ్యవస్థీకరణ కోసం కాదు. ఇన్ని వంకర మాటలు ఎందుకు? పునరుద్ధరణే అనకూడదా? సంస్కర్తలు సమూలవిచ్ఛేదనం కోరుకోలేదా? ఈ మాటకి అసలు అర్థం లేదు. వ్యవస్థని పూర్తిగా మార్చాలనే మార్క్సిస్టుల ప్రయత్నాల్ని జి.వి యస్. సమూలవిచ్ఛేదనం అంటున్నాడనేది స్పష్టం. వ్యవస్థ మారటం అంటే విచ్ఛిన్నతేకానీ సమూలవిచ్ఛిన్నత కాదు. అయినా దోపిడీని సమూలంగా విచ్ఛిన్నం చేయకపోతే సమసమాజం ఎలా వస్తుంది? మళ్ళా దోపిడీని పునరుద్ధరించటానికి కాస్త మూలం ఉంచమంటారా? కులవ్యవస్థ మూలాల్ని నిర్మూలించకపోతే కుల నిర్మూలనం ఎలా సాధ్యం? కాస్త అంటరానితనాన్ని ఉంచి కాస్త నిర్మూలించమంటారా? సతీసహగమనంలో సతి మొఖం మాత్రం కాల్చి మిగిలింది ఉంచుతారా? రాజ్యాంగ యంత్రాన్ని తప్ప విజ్ఞాన శాస్త్రాల్నీ, వివిధ రంగాల్లో నిపుణుల బృందాన్నీ విప్లవానంతర దశలో కొనసాగిస్తారు. సమసమాజానికి బూర్జువా వ్యవస్థ పుట్టు మచ్చలు చాలా కాలం ఉంటాయి సంఘసంస్కర్తలు సమాజంలో అన్నిటినీ విచ్ఛేదనంచెయ్యాలని ఎందుకు కోరతారు. అలా కోరితే వాళ్ళు సంస్కరణ వాదులు ఎలా అవుతారు వాళ్ళు కోరటానికి వీల్లేనిదాన్ని కోరలేదు అని చెప్పటం ఏమిటి? సంస్కరణ అంటే ఏమిటో తెలిసిన వాళ్ళు అనే మాటలేనా ఇవి? సంస్కరించదలుచుకున్న వాటిని సంస్కర్తలు సమూలంగానే సంస్కరించాలని కోరుకున్నారు.

"సంస్కరణోద్యమాల వలన గతం వర్తమాన వ్యవస్థకు తగినట్లుగా పరిష్కరించబడింది" (జి.వి.యస్) ఇది మతి ఉండేవాడు రాసే వాక్యమేనా? సంఘ సంస్కర్తల కృషి వర్తమాన సమాజం కోసమా? గతంతోని సమాజాల కోసమా? గతాన్ని ఎవరు మాత్రం ఎట్లా మారుస్తారు? వలసవాదులు రాజ్యాధికారానికి రావడంతో కదిలిపోయిన భారతీయ సమాజాన్ని గత మృత భారం నుంచి విముక్తి చెయ్యటానికి సంస్కర్తలు కృషిచేశారు. కొత్త అవసరాలకి అనుగుణ్యంగా వర్తమాన సమాజాన్ని ఆధునికం చెయ్యటానికి సంస్కర్తలు పోరాటం చేశారు. వేదాల్లోని, ఉపనిషత్తుల్లోని తాత్త్విక భావాల్ని ఆమోదించిన సంస్కర్తలు కూడా ఏ ప్రాచీన సాంఘిక సంస్థనీ ఆమోదించలేదు. 'Ruturn to the Past' గతంలోకి తిరిగిపొండి అనే పునరుద్ధరణవాదుల్ని సంస్కర్తలని పిలవకూడదు. అయితే వాళ్ళు కూడా గత సామాజిక సంస్థల్ని పునరుద్ధ

రించలేకపోయారు. సంస్కర్తలు కోరుకున్నది వర్తమానం మీద గత ప్రాబల్యంకాదు, గతం మీద వర్తమాన ప్రాబల్యం. వాళ్ళు ఉదార ప్రజాస్వామ్య వాదులు. సంస్కర్తల దృష్టిలో సమాజ అంతిమ లక్ష్యం అన్ని రంగాల్లోనూ ప్రజాస్వామ్యం. మనువుకీ, వేదాధికారానికీ ఒక నమస్కార బాణం విసిరి చరకుడు, శుశ్రుతుడు మను ధర్మానికి నష్టంకలిగించే వైద్యశాస్త్రాన్ని అభివృద్ధి చేసినట్టు, సంఘ సంస్కర్తలు కూడా బ్రిటీష్ వాళ్ళకి ఒక నమస్కారం, ఒక అభినందన పడేసి అంతిమంగా వలసవాదుల్ని ప్రతిఘటించటానికి ఆవశ్యకమైన ప్రజాస్వామీకరణం చేశారు. స్త్రీ సంక్షేమం, ఆధునిక విద్య, విజ్ఞానశాస్త్రం, సామాజికశాస్త్రాల అధ్యయనం, వర్ణవ్యవస్థ వ్యతిరేకత వలసవాదులకి ఉపయోగపడ్డాయా? అయిక్యంగా ప్రజలు జాతీయోద్యమ పోరాటం చెయ్యటానికి పోషక పదార్థాలుగా దోహదం చేశాయా? నిస్సందేహంగా జాతీయోద్యమానికి సంస్కర్తలు బలమైన పునాదులు వేశారు.

విశ్వనాథ సంస్కరణోద్యమం సాధించిన సకల సామాజిక, సాంస్కృతిక విలువల్ని మూలమట్టంగా ఖండించాడు. మనువు చెప్పిన వర్ణ ధర్మం, ఆశ్రమ ధర్మం, వర్ణాశ్రమ ధర్మం, నైమిత్తిక ధర్మం, గుణ ధర్మం, రాజ ధర్మం- అన్నిటినీ ఎంత మంద బుద్ధికయినా అర్థమయ్యేంత స్పష్టంగా 1930 నుంచీ 75 దాకా తన రచనలన్నిటిలోనూ చెప్పాడు. సూది మొన అంత బుర్ర ఉన్న వాడు కూడా నమ్మలేని మూఢాతి మూఢమైన విశ్వాసాల్ని కుటిల కుతంత్ర వాదంతో సమర్థించాడు. హిందూ నిరంకుశ నీచ వ్యవస్థ విశ్వనాథ ఆశయం. సమాజ అంతిమ లక్ష్యాలుగా ధర్మార్థకామ మోక్షాలనే పురుషార్థాల్ని ఆమోదించాడు. ఇందులో ధర్మం అంటే వర్ణాశ్రమాది మనుధర్మమే. ఆ ధర్మం విధించిన నియమాల ప్రకారమే అర్థ, కామ, మోక్షాల్ని పొందాలి. ద్విజులు అర్థకామాల్ని పొందటానికీ, స్త్రీ శూద్ర పంచములు అర్థకామాల్ని పొందటానికీ మౌలికమైన భేదం ఉంది. సమాజంలో వాళ్ళ స్థానాన్ని బట్టే అర్థ, కామాల్ని పొందాలి. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం; గుణకర్మ విభాగశః" (భగవద్గీత జ్ఞానయోగం, 13) అనే పాదాల్లోని గుణం అంటే ధర్మం కర్మ అంటే వైదిక కర్మలు. "కర్మణ్యే వాధికారస్తే; మాఫలేషుకదాచన" (సాంఖ్య యోగం, 47) ఇందులో కూడా కర్మ అంటే క్షత్రియుడికి విధించిన వైదిక కర్మ అనే అర్థం. కర్మ ఫలితాన్ని ఈ జీవితంలో చూడకూడదు. వచ్చే జన్మలోనే చూడాలి. ఈ పాదాలకి దేశ, కాల స్పృహలేని స్వప్రయోజన పరులైన వ్యాఖ్యాతలు సందర్భశుద్ధిలేని అర్థాలు చెప్పారు. కాబట్టి పురుషార్థాలు అనేవి మనుధర్మమే. ప్రాచీన బ్రాహ్మణ మత

అంతిమ లక్ష్యాలే కానీ ఆధునిక సమాజ లక్ష్యాలు కావు. ఈ విధంగా విశ్వనాథ సంఘ సంస్కరణోద్యమ ఆశయాలకి పూర్తిగా భిన్నమైన, వ్యతిరేకమయిన మనుధర్మాన్ని తన సాహిత్యం నిండా నింపితే, జి వి యస్. నవ్యసంప్రదాయానికి, దానికి సేనాని అయిన విశ్వనాథ సాహిత్యానికి సాంస్కృతికకోణం సంఘ సంస్కర్తల సాంస్కృతికకోణం అంటున్నాడు. వల్లభాచారి తాళం వేస్తున్నాడు. వీళ్ళిద్దరికీ సంస్కృతిని గురించి, సంఘ సంస్కరణ గురించీ, విశ్వనాథ సాహిత్యం గురించీ ఏమీ తెలియదని అనుకోవాలి. లేకపోతే లోకవంచనకు పాల్పడుతున్నారని అనుకోవాలి.

విశ్వనాథ పునరుద్ధరణ వాదుల్ని అధిగమించి బ్రాహ్మణ మత సర్వ పునరుద్ధరణ వాదాన్ని ఎందుకు చేపట్టాడు? ఆయన వలసవాదాన్ని ఖండించాడా? సమర్థించాడా? దేశంలో జాతీయ చైతన్యాన్ని నిరోధించటానికి, స్వాతంత్ర్య భావాల్ని అంకురించకుండా చెయ్యటానికి వలసవాదులు రెండు పనులు చేశారు. హిందూ మేధావుల, పండితుల దృష్టిని ప్రాచీన భారతీయ యుగాలవైపు మళ్ళించారు ఆర్యజాతి ఆధిపత్యవాదం, సంస్కృతంలోని వేదాలనుంచీ మనుధర్మశాస్త్రం వరకూ ఉన్న సాహిత్యంలో గ్రీకు సాహిత్యంలో ఉన్న పోలికల్ని ఎక్కువగా చేసి చూపటమేకాక, మాక్స్‌ముల్లర్, విలియంజోన్స్‌లు ఆర్యవాఙ్మయాన్ని ఇంగ్లీషులోకి ఇతర పాశ్చాత్య భాషల్లోకి అనువాదం చేసి విస్తృత ప్రచారం చేశారు. 1884లో అబ్రహాం రోగర్ భర్తృహరి సుభాషితాల్నీ, 1785లో చార్లెస్ విలికిన్స్ భగవద్గీతనీ, విలియంజోన్స్ 1789లో మనుధర్మశాస్త్రాన్నీ, 1838లో రోసన్ ఋగ్వేదాన్నీ అనువదించారు. ప్రాచీన యుగానికి హిందూ యుగం అని పేరు పెట్టి ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ, నార్వే, డెన్‌మార్క్ మొదలైన దేశాల్లో వైదిక వాఙ్మయాన్నీ, కావ్య, నాటక సంప్రదాయాల్నీ ప్రచారం చేశారు. ముస్లింలు రాక పూర్వయుగాన్ని అన్ని వైపుల నుంచీ ఆదర్శీకరించారు మధ్యయుగానికి ముస్లిం యుగమని పేరు పెట్టి, ముస్లిం పాలన వల్ల భారతీయ స్వర్ణయుగం నాశనమైపోయిందనీ హిందువుల మనస్సుల్లోనూ, మీరు పాలకవర్గం, మిమ్మల్ని హిందువులు అణిచివేస్తారు జాగ్రత్త అని ముస్లింల మనస్సుల్లోనూ ఆంగ్లేయులు విషం ఎక్కించారు దీన్తో కొందరు హిందువులు ప్రధాన శత్రువులైన వలసవాదుల్ని విస్మరించి ప్రాచీన యుగాల్లోకి పోయారు. ముస్లింలు అయిదు శతాబ్దాలు పాలకులమైన మాకు హిందువుల వల్ల ప్రమాదం ముంచుకొస్తోందని మధ్యయుగాన్ని కీర్తించటం ప్రారంభించారు. ఈ విషయంలో వలసవాదులకు తోడు హిందూ ముస్లిం సంస్థానాధీశులూ, జమీం

దార్లు, బడా భూస్వాములు కూడా దోహదం చేశారు. హిందూమతంలో వలస వాదులు వివిధ కులాల మధ్య చిచ్చుపెట్టారు. చరిత్రలో సుదీర్ఘంగా అణిచివేయ బడిన శూద్రకులాల్లో, బ్రాహ్మణవర్ణాధిపత్య వ్యతిరేక, కుల వ్యతిరేక భావాలు బహిరంగ వేదికమీదికి వచ్చాయి. కుల సంఘాలు ఏర్పడ్డాయి. దీన్తో బ్రాహ్మ ణుల్లో ఒక బృందం ముఖ్యంగా వైదిక బ్రాహ్మణులు ప్రాచీన శాస్త్రాలు ఆధా రంగా భూసురోత్తమ సిద్ధాంతాన్ని లంకించుకున్నారు. వలసవాదుల ఈ కుట్రలో పడిన పునరుద్ధరణ, సర్వ ఉద్ధరణవాదుల్లో విశ్వనాథ ప్రముఖుడు. వలసవాదుల ప్రేరణ లేకపోతే, విశ్వనాథ మనుధర్మ కలుషిత సాహిత్య సృష్టి చెయ్యటా నికి అనుకూలమైన సామాజిక పునాది 1930 ఆంధ్ర ప్రాంతంలో లేదు కాబట్టి వలసవాదుల్ని అభినందించినట్టు కనిపించిన సంస్కరణవాదుల కంటే, వాళ్ళని వ్యతిరేకించినట్టు కనిపించిన విశ్వనాథ సాహిత్యమే వలసవాదానికి ఎక్కువ దోహదం చేసింది (ఆంగ్లేయపాలననీ, మహారాణినీ, రాజునీ ప్రస్తుతిస్తూ పద్యాలూ పుస్తకాలూ రాసిన వాళ్ళల్లో సంప్రదాయిక పండితుల్లో చాలా మంది ఉన్నారు. ఈ పొగడ్తల్లో సంస్కరణవాదుల కంటే సంప్రదాయిక కవులే, సంస్కర్తల్ని వ్యతిరేకించిన కవులే ముందువరసలో ఉన్నారు.) ఆధునిక విద్యనీ, స్త్రీ సంక్షేమాన్ని, మత మూఢవిశ్వాస వ్యతిరేకతనీ, ఏకేశ్వరోపాస ననీ, వర్ణాశ్రమ ధర్మ వ్యతిరేకతనీ, విజ్ఞానశాస్త్ర ఆవిష్కరణల్ని, ప్రజాస్వా మిక, సామ్యవాద భావాలనీ, ఆధునిక రహదారుల్ని, రవాణాసౌకర్యాల్ని, ప్రాంతీయ సాహిత్యాల్ని, భాషాశాస్త్రాన్ని, వ్యవహారిక భాషనీ గట్టిగా సమ ర్థించి ప్రచారం చేసిన సంస్కరణవాదుల వల్ల దేశం మధ్యయుగాల నుంచీ బయటపడటమేకాకుండా వలసవాద పునాదులు కంపించాయి. జాతీయోద్యమా నికి ఇవి ప్రాణవాయువుగా ఉపయోగపడ్డాయి. సంస్కర్తల ఒత్తిడివల్ల వలస వాదులు ప్రవేశపెట్టిన సకల ఆధునిక విషయాల్ని విశ్వనాథ పేరు పేరునా మనుధర్మ దృక్పథం నుంచీ ఖండించాడు. విశ్వనాథ బోధించినట్టు బస్సులూ, రైళ్ళూ, విమానాలూ ఎక్కకపోతే, ఆధునిక విద్యాలయాల్లోకి చదువుకోవటా నికి స్త్రీ పురుషులు చేరకపోతే, వర్ణాశ్రమ ధర్మాల్ని అనుసరించి ప్రజలు జీవించి ఉంటే, ప్రజాస్వామిక భావాల్ని నిరాకరించి రాచరికవ్యవస్థని ఆరా ధిస్తూ జమీందార్లకి, భూస్వాములకి, వడ్డీవ్యాపారస్తులకి, బ్రాహ్మలకి లొంగి బతికిఉంటే, విజ్ఞానశాస్త్రాల్ని అధ్యయనం చెయ్యకుండా శకునశాస్త్రాల్ని, పంచాంగాల్ని పారాయణంచేస్తూ కూర్చునిఉంటే వలసవాదులకి చీమకుట్టినంత నష్టమైనా ఉండేదా? అసలు జాతీయోద్యమం అంటూ ఒకటి వచ్చేదా? వలస

వాదులు కానీ సామ్రాజ్యవాదులు కానీ ఏ దేశంలో అయినా ఏ కాలంలో అయినా ఫ్యూడల్, దళారి బూర్జువా వర్గాల సహకారంతోనే దోపిడీ చేయగలుగుతారు. దేశంలో ముడిసరుకుల్ని సేకరించటానికీ, పోలీసుల్ని పంపించటానికి అను కూలంగా బ్రిటిష్‌వాళ్ళు రైలు మార్గాలువేస్తే, భారత ప్రజలకు సౌకర్యంగా ఉండేరీతిలో రైలుమార్గాలు వెయ్యమని సంస్కరణవాదులు విజ్ఞప్తిచేశారు. విశ్వ నాథ వర్ణ ధర్మం చెడిపోతుందని, గ్రామాలు కదిలిపోతాయని అసలు రైళ్ళే వద్దన్నాడు. మిగిలిన విషయాల్లో కూడా ఇదే ధోరణి. కాబట్టి విశ్వనాథ సాహిత్యం వలసవాదుల కాళ్ళు కడిగి పసుపుపూసిన ఫ్యూడల్ సాహిత్యం. విశ్వనాథ వలసవాద వ్యతిరేకి కాకపోవడమే కాదు, వలసవాదులు స్వప్రయో జనాల కోసం, పరివారకుల్ని సృష్టించుకోవటం కోసం పునరుద్ధరించిన దుష్ట మైన హిందూ ఫ్యూడల్ సాంస్కృతిక శిథిలాలకి తిరుగులేని ప్రతినిధి.

సంస్కరణోద్యమం ఆధునిక ప్రాంతీయ భాషా, సాహిత్యాల్ని గుణా త్మకంగా అభివృద్ధి చేసింది. ప్రాచీన, మధ్యయుగాల్లో అధికారవర్గ ప్రాంతీయ సాహిత్యాలన్నీ సంస్కృత సంస్కృతిని అనుసరించినవే. ఆర్యీకరణం, సంస్కృతీకరణం, ఏలనీకరణంల ద్వారా మనుధర్మానికీ, రాచరిక వ్యవస్థకీ, వాటికి అనుగుణ్యమైన అలంకారశాస్త్రాలకీ ప్రాంతీయ భాషా సాహిత్యాలన్నీ విధేయం చేయబడ్డాయి. నిర్బంధ లక్షణ శాస్త్రాలద్వారా సంస్కృత సాహిత్యం నుంచీ అనువాదాల ద్వారా, అనుసరణల ద్వారా ప్రాంతీయ సాహిత్యాల్ని హిందూ ఫ్యూడల్ సాహిత్యంలో భాగంగా చేశారు. ప్రాంతీయ కావ్య భాషని అంతఃపుర, ఆస్థాన, ఆశ్రమభాషగా మార్చివేశారు. అనేక ప్రాంతాల్లో కవులు సంస్కృత సంస్కృతిని ప్రతిఘటించినప్పటికీ అణిచివేశారు. ధర్మశాస్త్రకారులు కావ్యకళకి వ్యతిరేకులు. ఏ స్మృతిలో ఉందో తెలియదు కానీ "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" కావ్యాల్ని చదవ వద్దని చెప్పారు. కవి సృజనలో స్వేచ్ఛ ఉంటుంది. మానసిక స్వేచ్ఛ లేనివాడు కవి కాలేడు. ఆ స్వేచ్ఛలో ధర్మాతిక్రమణాన్ని కవులు బోధించే అవకాశం ఉంది. అందుకనే ధర్మశాస్త్రం కావ్యాలాపాన్ని నిషేధించింది కానీ ఆలంకారికులు వేదధర్మాన్ని అనుసరిస్తామనీ, ధర్మాన్ని కవులు జవదాటకుండా సిద్ధాంతాలు చేశారు. "యత్రతుపునరుత్తమ పురుష చరితం ననిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ తద్విషమాచస్మృతిః కావ్యాలాంపాశ్చ వర్జయేత్" (విద్యానాథుడు. ప్రతాపరుద్రీయం. ఉల్లేఖన కావ్యాలంకార సంగ్రహం 117) ఉత్తమ పురుష చరిత్రం వర్ణించని కావ్యం విడిచిపెట్టవలసిందని మాత్రమే స్మృతి అభిప్రాయమనీ, ఉత్తమ పురుష చరిత్రం అంటే ధర్మోపదేశంతో

కూడిన రాజు లేదా బ్రాహ్మణుని చరిత్రమనీ విద్యానాథుడనే ఆలంకారికుడు వ్యాఖ్యానించాడు. అలంకారశాస్త్రాలు మనుధర్మాన్ని ఆదర్శంగా అంగీకరించి సాహిత్యాన్ని వర్ణాశ్రమధర్మ పాదాలకి అంకితం చేశాయి. విశ్వనాథ సాహిత్య ధ్యేయం కూడా ఇదే. నవకథా సృష్టిని వ్యతిరేకించటంలో కూడా ఇదే ఉద్దేశం. "కవిత్రయం పోతన్నల వంటి మహానుభావుల దారిలో వ్రాశాను" (విశ్వనాథ వాఙ్మయసూచిక 95) వాళ్ళు నాయకులు, ఈయన వాళ్ళ వేషధారి. "దేవభాష నుంచి ప్రాంతీయ భాషలు వేరుకాదు". (95) "ప్రాంతీయ భాషలు సంస్కృతం నుంచీ వేరుకాదు" (96) ఆర్యీకరణం చేసిన వాళ్ళు ప్రాంతీయ సాహిత్యాల వ్యక్తిత్వాన్ని దెబ్బతీయటమేకాక సంస్కృత భాషకి దగ్గరగా ఉండే కృతక కావ్యభాషని అభివృద్ధి చేశారు. ఎన్ని శాస్త్రాలు ఎంతగా ఉద్ఘోషిస్తున్నా విశ్వనాథ అన్ని భాషలూ సంస్కృతం నుంచే పుట్టాయనే మూఢవిశ్వాసాన్ని మార్చుకోలేదు. దేశభాష ఏమిటి వీళ్ళ బొంద? ఏ భాష అయినా మానవుల భాషే, సమిష్టి మానవుని శ్రమ నుంచి పుట్టేవే. ఈ విధంగా విశ్వనాథ సంస్కృతి సంస్కృతిలో భాగంగా రచనలు చేసి ఆధునిక సాహిత్య చరిత్రని తప్పుదోవల్లోకి మళ్ళించటానికి ప్రయత్నించి విఫలమయ్యాడు. సంఘ సంస్కరణోద్యమం సాధించిన సాంస్కృతిక విలువల్లో వ్యవహారిక భాష చాలాముఖ్యమైంది. విశ్వనాథ తెలుగులో గిడుగు, గురజాడలు పోరాటంలో సాధించిన, విజయవంతమైన వ్యవహారిక భాషా ఉద్యమాన్ని ఖండించి తనదైన ఒక కృత్రిమ భాషలో గ్రంథరచన చేశాడు క్రైస్తవులు తమ మత ప్రచారం కోసం ఉద్దేశపూర్వకంగా విలక్షణమైన భాషను రూపొందించుకున్నట్టు విశ్వనాథ బ్రాహ్మణ మత ప్రచారానికి ఒక వికృతమైన భాషణా పద్ధతుల్ని అనుసరించాడు. అది "అన్నీ వేదాల్లోనే ఉన్నాయష" అనే బుచ్చమ్మ భాష లాంటి వైదిక బ్రాహ్మణుల ఛాందస భాష కూడా కాదు. అది విశ్వనాథ విశ్వామిత్ర సృష్టి. "నాది వ్యవహార భాష మంథరము శైలి, తత్వము...." (రా క. అవతారిక. 38) "ఈ తెల్గు మేల్, నుడికారమ్ములు దేశ్యముల్ పలుకు బళ్ళున్ జాతి మాట్లాడుకై, నది...." (అదే. 39) 1930లో వ్యవహారిక భాషలో రాసేనాడు తనది వ్యవహారిక భాష అని ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అగత్యం లేదు. తను రాసేది వ్యవహారిక భాష కాదు గనుకనే, కాదని సమకాలికులు విమర్శించారు కాబట్టే చెప్పుకున్నాడు. తెలుగునుడికారాలూ, పలుకుబళ్ళూ విశ్వనాథ ప్రయోగించింది నిజమే. కానీ ఆ నుడికారాల్నీ, పలుకుబళ్ళనీ విశ్వనాథ తన కృతికభాష అనే పావ కాళ్ళ కింద పూవులు నలిగినట్టు నలిపివేసాడు. విశ్వనాథ చేతుల్లో నుడికారాల్లో

ఉంటే జీవకళకి ప్రేతకళ ప్రాప్తిస్తుంది. ఎగిరే పక్షి రెక్కలు కత్తిరించినట్టు కోకిల గొంతులో సూదులు గుచ్చినట్టు ఉంటుంది. పద్య రచనల్లో వచనరచనల్లో, చివరికి నాటకాల్లో కూడా విశ్వనాథ భాష తెలుగుజాతి మాట్లాడే భాషకాదు. గ్రాంథికభాషా చట్రంలో ఆధునిక భాషని వికృతీకరించాడు. వక్రశైలి అనే అర్థంలో విశ్వనాథ శైలితత్త్వం మంథరమే. "యుగకర్త చిన్నయసూరి కానీ వీరేశలింగం పంతులు కాదు" (విశ్వనాథ, వా సూ. 98) అద్భుతమైన ఆశ్చర్యం! తెలుగుభాష గ్రాంథికభాష సంకెళ్ళ నుంచీ బయటపడుతూ వ్యవహారిక భాషలోకి సహజ పరిణామం పొందుతున్న క్రమాన్ని ఎదుర్కొని చిన్నయసూరి బాలవ్యాకరణం రాసి గ్రాంథిక భాషని పునరుద్ధరించాడు. దీనికి వ్యతిరేకంగా గిడుగు, గురజాడలు పెద్ద యుద్ధం చేశారు. నాది వ్యవహారికభాష అని చెపుతూ విశ్వనాథ చిన్నయసూరిని యుగకర్తగా భావించడం కంటే ఆత్మవంచనా పరవంచనా ఎక్కడయినా ఉంటాయా? రచయితా కవి ఏమీ కాని చిన్నయసూరిని సంఘ సంస్కరణోద్యమ నాయకుడైన కందుకూరి కంటే ఉన్నత స్థానంలో పెట్టగల మూర్ఖత్వం విశ్వనాథకి తప్ప మరొకరికి ఉందా? సంస్కరణ మీద వ్యతిరేక విషమేకదా ఈ చెత్త వాగుడికి కారణం. సంఘ సంస్కరణని అన్ని వైపుల నుంచీ వ్యతిరేకించిన విశ్వనాథ సాహిత్యానికి సంఘ సంస్కరణోద్యమం సాంస్కృతిక కోణంగా చిత్రిస్తున్న జి.వి.యస్ కి నీతీ, నిజాయితీలంటే ఏమన్నా తెలుసా? ఇంత అబద్ధపు, కుటిలరాతలు రాసే విమర్శకుడు ప్రపంచ సాహిత్యంలో ఎవడైనా ఉంటాడా? ఏమండీ, వల్లభాచార్యగారూ! సాహిత్య వంచకుడ్ని సమర్థించటానికి మీకు సిగ్గువెయ్యటంలేదా? పైగా ఆయన్ని సమర్థించటానికి ఆయన కంటే అబద్ధాలాడటానికి సిద్ధపడటం ఘోరమైన పతనంగా కనిపించటంలేదా? సంఘ సంస్కరణోద్యమ ప్రభావం భావకవిత్వం మీద స్పష్టంగా ఉంది కానీ సంస్కరణోద్యమ ఆశయాల్ని శాస్త్రీయంగా అవగాహన చేసుకొని వాటిని ఉన్నతస్థాయిలో జీర్ణించుకొని ముందుకు తీసుకపోయింది శ్రీశ్రీ అభ్యుదయ సాహిత్యోద్యమం. అభ్యుదయ సాహిత్యం భావకవిత్వం మీద తిరుగుబాటుగా వచ్చిందనేది పైకి కనిపించే పాక్షిక సత్యం మాత్రమే. భావకవిత్వం అప్పుడు ప్రధాన ధోరణిగా ఉంది కాబట్టి అభ్యుదయ కవిత్వం దానికి వ్యతిరేకంగా వచ్చినట్టు అనిపిస్తుంది. ప్రారంభంలో ఎలా ఉన్నా తర్వాత అభ్యుదయ సాహిత్యం హిట్లర్ ఫాసిజానికీ, విశ్వనాథ తదితరులు బోధించిన హిందూ ఫాసిజానికి వ్యతిరేకంగా శ్రామికవర్గ పక్షపాత దృక్పథం నుంచీ ప్రభవించిన సాహిత్యం. విశ్వనాథ సాహిత్య కుంభస్థలాన్ని బద్దలు

కొట్టిన వాడు శ్రీశ్రీ. మనుధర్మం మీద చావుదెబ్బ కొట్టిన వాడు శ్రీ శ్రీ. దివ్య చైతన్యం పేరుతో, నవ్యసంప్రదాయం, పేరులో మనుధర్మాన్ని ఉన్నతీకరించ టానికి ప్రయత్నంచేస్తున్న కొద్ది మంది నిర్జన, నిర్జీవ కవులు తప్ప ఆధునిక కవులంతరూ మనుధర్మ వ్యతిరేకులే. కాబట్టి జి వి యస్. నవ్యసంప్రదాయ గాలిమేడకి సంఘ సంస్కరణ సాంస్కృతిక కోణం ఒక నీటి స్తంభం. ఒకటి మాయ, మరొకటి మిథ్య.

# ఆవాహన

అక్కడ
మీరు రాజేస్తున్న నెగడుని మేం చూస్తాం
ఆ నిప్పుల వేడి మాకు సోకదు
అయినా ఆ వెచ్చదనాన్ని మేం అనుభవిస్తాం
అక్కడ
మీరు పాడుతున్న బయనెట్ కొసల సంగీతాన్ని మేం వింటాం
ఆ సంగీతపు సాధనాలు మాకుండవ్
అయినా ఆ సౌందర్యానికి మేం దాసులౌతాం
అక్కడ
మీరు మోసుకొస్తున్న సూర్యుణ్ని మేం చూస్తాం
అలసిన మీ కన్నులు విజయపు చిరునవ్వుని పెదవుల కంపితే
ఆ నవ్వుకి మేం పరవశించిపోతాం
అక్కడ
సూర్యుని శత్రువు దొంగదెబ్బ ఎన్‌కౌంటర్ చేస్తే
తొర్రుపడిన మీ గుండెలు మా గుండెల్లో ప్రతిధ్వనిస్తాయి.
మీ గుండె గ్రెనేడై శత్రువు గుండెల్ని తునాతునకలు చేస్తే
ఆ శబ్దాన్ని మేం పదిలంగా దాచుకుంటాం
అక్కడ
తుపాకి గొట్టంలోంచి మీరు తెస్తున్న సూర్యుణ్ని
మేం ఇక్కడ ఆవాహన చేస్తున్నాం—

—గౌతమ్

స్కెచ్ :

# పాపం ఓటు!

—నవత

అప్పుడే సింగారించుకున్న తమను తాము చూసుకుని అవి చాలా మురిసి పోయాయి. అప్పటిదాకా కేవలం ఒక తెల్ల కాగితం ముక్కలా ఉండిపోయిన తమ మీద పువ్వులు, జంతువులు, సైకిలు, చక్రాలు, నాగలి బొమ్మలు చూసుకుని అవి తెగ సంబరపడిపోయ్యాయి.

తమకు ఎంత విలువ ఉందో చాలా సేపు తెలియలేదు. అచ్చేసిన వాటి నన్నింటినీ కలిపి కట్టలు కడుతున్న మనుషులు తమ గురించే మాట్లాడుకుంటూంటే అప్పుడు అర్థమయ్యింది తమ గొప్పతనం ఏమిటో! కొన్నాళ్ళు పోయాక తమమీద అమూల్యమైన ముద్రపడుతుందని అప్పుడు నిజంగా తమకు చాలా గొప్పతనం వస్తుందని వాటికి తెలిసింది.

కొన్నాళ్ళకు వాటినన్నింటినీ ప్రయాణం కట్టించారు. ఏ ప్రాంతానికి కావలసిన వాటిని ఆ ప్రాంతానికి తరలిస్తున్నారు. ప్రయాణంలో ఉండగా వాటికి మైకుల హోరు వినిపించింది. తమ మీద ఉన్న బొమ్మల పేర్లు చెబుతూ ఆ గుర్తులకే ఓటెయ్యండని మైకులు అంటూంటే వాటికి ఎంత గర్వంగా అనిపించిందో! తాము చాలా ఎత్తుకు ఎదిగిపోయినట్టు అవి భావించేసుకున్నాయి.

అసలు రోజు వచ్చింది. అవన్నీ ఎంతో ఉత్సాహంగా, ఆత్రుతగా ఎదురుచూస్తున్నాయి. ముందుగా బయటికెళ్ళే దానికి మరీ ఆత్రంగా ఉంది. మొత్తానికి దాన్ని బయటకు తీసారు. ఒక్క నిమిషమైనా వెలుగు చూడనివ్వకుండా చీకటి పెట్టెలోకి తోసేశారు మిగతావన్నీ కూడా మెల్లమెల్లగా ఒక దాని తర్వాత ఒకటి చీకటి పెట్టెల్లోకి వెళ్ళిపోయాయి.

పెట్టెలోకి వచ్చినవన్నీ తామెలా వచ్చిందీ చెప్పుకున్నాయి. మొట్టమొదటిది ముందుగా తన కథ చెప్పింది., బయట ఏదో కలకలా వినిపించిందనుకున్న వాటికి చీకటి పెట్టెలోకి చేరాక మిగతా వాటి మాటలు విని అసలు సంగతి అర్థమైంది. ఎవరో కొందరు వచ్చి ఒకే బొమ్మ మీద ముద్రలు వేసేసి వెళ్ళిపోయారు. తాము భావించినట్టుగా తామందరూ ఒకే విధంగా పవిత్రంగా ఈ పెట్టెలోకి రాలేదని వాటికి అర్థమైంది. అది తమకు తీరని అవమానంగా అవి భావించుకున్నాయి.

నిరాశా నిస్పృహల్లో మునిగిపోయిన వాటిని లెక్కపెట్టడం ప్రారంభించారు. కాసేపయ్యాక పెద్ద పెద్ద శబ్దాలు వినిపించాయి. అకస్మాత్తుగా గదంతా చిందర వందరగా మారిపోయింది. అందరూ గొడవ గొడవగా మాట్లాడుకుంటున్నారు. ఏం జరిగిందో అర్థమయ్యే లోపే అవన్నీ ఎక్కడో చెత్తా చెదారం ఉన్న చోటికి చేరాయి. అంతలోనే తామొక ఎర్రని చిక్కటి సముద్రంలో తేలుతున్నట్టు అవి గ్రహించాయి.

కొందరు వాటిని చూసి గబగబా ముందుకొచ్చి వాటిని ఏరుకున్నారు. ఎవరి చేతుల్లో అయితే తాము పవిత్రంగా మారతామని అవి భావించాయో అక్కడికి చేరేటప్పటికి ఏం జరుగుతుందా అని అవి చాలా కుతూహలంగా ఎదురు చూడసాగాయి.

అవి ఎక్కువసేపు ఎదురుచూడకుండానే వాళ్ళు ఆ ఎర్రటి నీళ్ళపై కాళ్ళు తపతపలాడిస్తూ, ఎవరి మీదనో కోపంగా అరుస్తూ వాటిని పరపరా చింపి పారేసారు....

○

# వెదురుచెట్టు

అల్లనల్లన గాల్లో వయ్యారాలు పోతోన్న పిల్లనగ్రోవిని అడిగా-
ఇంత మధురమైన రాగం నీకెలా వచ్చిందో చెప్పమని
సహజాతాల్ని నవ్వి ఆకాశం నక్షత్రాలను నేల
రువ్వినచోట ఇసుకతిన్నెల మాటున
నన్ను తయారుచేసిన శ్రామికుణ్ణి అడుగు అన్నది
వేలాది వేణువుల్ని నగరంలో వెదజల్లిన మాట నిజమే
అవన్నీ బుద్ధిపుట్టిన ప్రేమరాగాలు పాడుకుంటూ
వాద్యకారుల తన్మయత్వాన్ని నెమరేసుకుంటున్నాయి.
వేణువులకు మూలమైన మన్యం వెదురుచెట్టును
ఓసారి కలవమన్నాడు శ్రామికుడు
శతాబ్దం వార్ధక్యాన్ని అరవిరిసిన ఆశలతో
మోస్తున్న వెదురుచెట్టు యిలా చెప్పింది-
"మధుర రాగాలూరించే పిల్లనగ్రోవితోబాటు
అల్లూరికి విల్లునయ్యిందీ నేనే!"

—రమణ

# విరసం విశేషాలు

***30-6-91 న గుంటూరులో విరసం కార్యవర్గం చేసిన తీర్మానాలు***

## 1. మాటల్లో బ్యాలెట్ చేతల్లో బుల్లెట్

ఓటుతో నోటుతో ఎన్నికల పేరున పాలకులౌతున్న వారు కనీసం నిర్ణయించబడిన వరకు కూడ స్థిరంగా పాలించలేక పదిహేను నెలల్లోనే వాటాలు కుదరక తన్నుకుని కుప్పకూలి మళ్ళీ నిస్సిగ్గుగా 10వ లోకసభకు ఎన్నుకోమని ప్రజల ముందుకు వచ్చారు. ఐతే ప్రపంచంలోనే పెద్ద ప్రజాస్వామ్య దేశపు ఎన్నికలు ఎన్ని అక్రమాలు జరగాలో అన్ని అక్రమాలతో కనీవినీ ఎరుగని హింసతో ముగిసాయి ఎన్నికల పట్ల ప్రజల నిజమైన అభిప్రాయాన్ని వెల్లడి చేయనీయకుండా, ఓటు వేయకుండా వుండేందుకు గానీ, నిజాయితీగా ఓటు వేయడానికి గాని ప్రజల కవకాశం ఇవ్వకుండా పాలకవర్గాల్లో ఎవరికి ఏఏ బూతుల్లో పోలీసుల, గూండాల బలం ఉంటుందో అక్కడ వినియోగించి తామే ఓట్లు వేసుకొని గెలిచారనడానికి ఈ ఎన్నికలు నిదర్శనం. పాలకవర్గాల కుమ్ములాటలకు గిరిజన హరిజన బలహీనవర్గాలను నిర్దాక్షిణ్యంగా బలిచేసి ఎన్నికల్లో అభ్యర్థులు గెలిచారనడానికి దేశ ఎన్నికల చరిత్రలోనే అత్యధికంగా బూతుల ఆక్రమణలు, ఎన్నికల వాయిదాలు, అభ్యర్థుల, ప్రజల హత్యలు గుర్తులు. అధికారంలోకి రావడానికి మాటల్లో బ్యాలెట్ అని అంటున్నా, ఆచరణలో మాత్రం బుల్లెట్‌ను ఉపయోగిస్తున్న పాలకవర్గ పార్టీల హింసను విరసం కార్యవర్గం ఖండిస్తున్నది. ప్రజలూ, ప్రజాస్వామ్యవాదులు ఈ ధోరణిని ఎదుర్కోవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నది.

## 2. దేశాన్ని ముంచెత్తబోతున్న ఆర్థిక సంక్షోభం

ఆశ్వరథ అంటూ ఎన్నికల సంరంభం ముగిసింది. ఎన్నికల కమీషన్ ఆదేశాలని ఖాతరుచెయ్యకుండా ఎందరో అభ్యర్థులు లక్షలు ఖర్చుపెట్టారు. ప్రతి పార్టి కూడా కోట్ల కొద్ది నల్లడబ్బు విచ్చలవిడిగా విరజిమ్మింది. ఇన్ని చేసినా, ఇంతచేసినా గొంగళి వేసినచోటే వుంది. మన పార్లమెంటు ఉయ్యాల లూగుతూనే వుంది. దీనికి నకలుగానే తయారయింది మన ఆర్థికవ్యవస్థ. అప్పుడే మన పాలకులు సామ్రాజ్యవాదుల సాలెగూటిలోకి స్వచ్ఛందంగా పరుగెడుతున్నారు అప్పుల ఎర చూపించి మనని పీల్చిపిప్పిచేయాలని చూస్తున్నారు.

ఇప్పటికే మనం బోలెడు అప్పులపాలయ్యాం. విదేశీ ఋణాలమీద వడ్డీ కూడా కట్టలేక ప్రజల నడుం విరిగిపోతోంది. మన దేశపు వెనకబాటుతనాన్ని ఆసరా చేసుకుని సామ్రాజ్యవాదులు మనకు అప్పుపెట్టి మనలని సొంతం కొల్ల గొట్టాలని చూస్తున్నారు. మనదేశంలోని ప్రతి రాష్ట్రానికి, ప్రతి నగరానికి అప్పుల ఆకర్షణ చూపిస్తున్నారు. రాబందుల రెక్కలలో మనం ఇరుక్కు పోతున్నాం.

నిత్యావసర వస్తువుల ధరలు చుక్కల్లోకి చూస్తున్నాయి. కూరగాయల ధరలు మండిపోతున్నాయి. పుస్తకాల ధరలు విరివిగా పెరిగిపోయాయని విద్యార్థి లోకం తల్లడిల్లుతోంది.

మన మీదికి విదేశీ సామ్రాజ్యవాదులు విసిరే వలలకు రంగు రంగుల పేర్లు పెట్టారు. I.M.F , WORLD BANK వీటిల్లో ముచ్చుకి కొన్ని.

ఈ కౌగిలిపు పులుల పంజాల నుంచి, గుంటనక్కల చిక్కుల నుంచి మన ఆర్థికవ్యవస్థని మనం సంరక్షించుకోవాలి. రకరకాల దోపిడీకి గురవు తున్న ప్రజలు చైతన్యంతో నూతన ప్రజాతంత్ర ఆర్థికవ్యవస్థని నిర్మించుకో డానికి పోరాడాలని విరసం విజ్ఞప్తి చేస్తోంది.

## 3. కాచినపల్లి బూటకపు ఎన్‌కౌంటర్ పోలీసుల హింసకు పరాకాష్ఠ.

ఖమ్మం జిల్లా ఇల్లెందు ప్రాంతం కాచినపల్లిలో 20-5-91 న విరాయు ధులైన సి.పి.ఐ. (యం.యల్.) ప్రజాపంథా కొత్తగూడెం డివిజినల్ కమిటీ సభ్యుడు కామ్రేడ్ కోటన్న, ఖమ్మం జిల్లా రైతుకూలీ సంఘం కార్యదర్శి కా॥ నంబూరి సీతారామారావు, ఖమ్మం జిల్లా ప్రగతిశీల మహిళా సంఘం జిల్లా నాయకురాలు సుశీన్‌కుమారి, టేకులపల్లి మండల ప్రజాపరిషత్ ఉపాధ్యక్షురాలు చింతా లక్ష్మి, రైతుకూలీ సంఘం నాయకులు కా॥ పరుశురాములు గార్లను పోలీ సులు కాల్చి చంపడం ఎన్‌కౌంటర్ల పేరుతో వారు సాగిస్తున్న హింసాకాండకు పరాకాష్ఠ విప్లవ సంస్థల నాయకుల్ని, కార్యకర్తల్ని అరెస్టు చేసి, చిత్ర హింసలు పెట్టి, కాల్చి చంపడం పోలీసులకు నిత్యకృత్యమైపోయింది. నక్స ల్బరీ పోరాట కాలం నుండి విప్లవ పార్టీలకు చెందిన అనేక మందిని పోలీసులు చంపి ఎన్‌కౌంటర్లుగా ప్రకటించారు. బూటకపు ఎన్‌కౌంటర్లలో చనిపోయిన వారందరూ నిజమైన ఎన్‌కౌంటర్లలోనే చనిపోయారని ప్రజల్ని నమ్మించడానికి

పోలీసులు నీచమైన పద్ధతుల ననుసరిస్తున్నారు. బూటకపు ఎన్‌కౌంటర్ల ద్వారా విప్లవాన్ని ఆపగలమనుకోవడం భ్రమ

కాచినపల్లిలో జరిగిన కా॥ కోటన్న తదితరుల బూటకపు ఎన్‌కౌంటర్ని విప్లవ రచయితల సంఘ కార్యవర్గం ఖండిస్తోంది. ఈ బూటకపు ఎన్‌కౌంటర్‌కు కారకులయిన పోలీసు అధికారులను శిక్షించాలని డిమాండ్ చేస్తోంది.

## సభలు :-

◯ 6-7-91 సాయంత్రం విజయవాడలోని ప్రెస్‌క్లబ్‌లో విరసం కృష్ణా జిల్లా శాఖ ఆధ్వర్యంలో శ్రీశ్రీ, చెరబండరాజుల వర్ధంతి సభ జరిగింది. విరసం సభ్యుడు కా॥ భరద్వాజ అధ్యక్షత వహించారు విరసం కార్యవర్గ సభ్యుడు, కృష్ణాజిల్లా యూనిట్ కన్వీనర్ కా॥ చారి శ్రీశ్రీ, చెరబండరాజుల సంస్మరణ లోని ప్రాధాన్యాన్ని వివరించారు

ప్రధాన వక్తగా విరసం కార్యదర్శి కా॥ వి. చెంచయ్య పాల్గొన్నారు. శ్రీశ్రీ, చెరబండరాజులు సమాజంపై ప్రభావం చూపగల విప్లవ కవిత్వం రాశారనీ, ఇద్దరూ కీలకమైన సమయాల్లో కూడా పాలకవర్గ నిర్బంధాలకు లొంగకుండా ప్రజల పక్షాన నిలబడ్డారనీ, విప్లవోద్యమ నేపథ్యంలో తుదిదాకా రచనలు చేసిన కలం యోధులనీ పేర్కొన్నారు

◯ 14-7-91 సాయంత్రం కరీంనగర్‌లోని నెహ్రూ యువక కేంద్రంలో విరసం సభ్యుడు కా॥ బి.యస్. రాములు రాసిన "పాలు" కథా సంకలనాన్ని ప్రముఖ రచయిత సాహు ఆవిష్కరించారు సమావేశానంతరం జరిగిన గతి తర్క తత్వశాస్త్ర చర్చలో జిల్లాలోని అనేక మంది రచయితలతోబాటు కా॥ బి.యస్. రాములు కూడా పాల్గొన్నారు.

◯ 27-7-91 సాయంత్రం నెల్లూరు టౌన్‌హాల్‌లో విరసం నెల్లూరు జిల్లా యూనిట్ తరపున "శ్రీశ్రీ ఉపన్యాసాలు", "ప్రజ" అనే పుస్తకాలు ఆవిష్కరింపబడ్డాయి. 'శ్రీశ్రీ ఉపన్యాసాల'ను ఆవిష్కరిస్తూ విరసం కార్యదర్శి కా॥ వి. చెంచయ్య ప్రజా రచయితల్ని ప్రజలే బతికించుకుంటారనీ, అలా 1970 తర్వాత శ్రీశ్రీని ప్రజలే పునర్జీవింపజేశారనీ అన్నారు. ఆంధ్రదేశ రాజకీయ చరిత్రని మనం తెలుసుకోవాలనుకుంటే శ్రీశ్రీ సాహిత్యం నుండి తెలుసుకోవచ్చుననీ, దేశంలోని అన్ని రాజకీయ సంఘటనలకూ స్పందించి రాసిన ప్రజా కవి శ్రీశ్రీ అని కా॥ చెంచయ్య పేర్కొన్నాడు. ప్రజల పక్షం నిలిచిన కవి

చివరి శ్వాసవరకూ ప్రజల పక్షమే నిలుస్తాడనడానికి శ్రీశ్రీ ఒక ఉదాహరణ అని ఆయన అన్నారు.

విరసం కార్యవర్గ సభ్యుడు, శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం సంపాదకుడు కా॥ చలసాని ప్రసాద్ "ప్రజ" పుస్తకాన్ని ఆవిష్కరిస్తూ శ్రీశ్రీ కోరుకుంటే పద్మశ్రీలూ, కళాప్రపూర్ణలూ ఈ ప్రభుత్వం ఎప్పుడో ఇచ్చి ఉండేదని, కానీ ప్రజల పక్షం వహించిన శ్రీశ్రీ వాటిని కాలదన్నాడనీ అన్నారు. మతపిచ్చి + కమ్యూనిస్టు వ్యతిరేకత = ఆర్.ఎస్.ఎస్. అని ఒక సందర్భంలో శ్రీశ్రీ అన్నాడని ఉటంకిస్తూ "ప్రజ"లోని అనేక విశేషాల్ని వివరించారు.

సభకు అధ్యక్షత వహించిన విరసం నెల్లూరు జిల్లా యూనిట్ కన్వీనర్ కా॥ కో ప్ర. మాట్లాడుతూ శ్రీశ్రీ బాటలో ప్రజల కోసం కలంపట్టిన విప్లవ రచయితల్ని కలంతో ఎదుర్కొనే దమ్ములు లేక ప్రభుత్వం కుట్రకేసులు బనాయిస్తోందనీ, కానీ అది జరిగేపని కాదని 20 సం॥ల విరసం చరిత్ర నిరూపించిందనీ అన్నారు.

○ 28-7-91 న అనంతపురం జిల్లా విరసం యూనిట్ ఆధ్వర్యంలో జరిగిన అమరవీరుల సంస్మరణ సభలో మూడు పుస్తకాలు ఆవిష్కరింపబడ్డాయి. "మొదటం మనం మానవులం, పౌరులం, తర్వాతే ఉద్యోగులం" అనే కా॥ వరవరరావు ప్రసంగాన్ని అనంతపురం జిల్లా ఎ.పి టి ఎఫ్ కార్యదర్శి కా॥ లామికృష్ణప్ప ఆవిష్కరించారు. ఈ ప్రసంగ వ్యాసం ప్రజలపట్ల ఉద్యోగుల బాధ్యతను విడమరిచి చెబుతుందనీ, ప్రజా వుద్యమాలపట్ల మేధావివర్గం తగిన విధంగా స్పందించకపోతే చరిత్ర క్షమించదనీ ఆయన అన్నారు.

విరసం అనంతపురం జిల్లాశాఖ కన్వీనర్ కా॥ అరుణ్, కా॥ చంద్రహాస కవితాసంకలనం "రక్తసిక్తసోపానాల"ను ఆవిష్కరిస్తూ చంద్రహాస కవితలను విశ్లేషించారు. కా॥ చంద్రహాస ప్రజాకవి అనీ, అతనికి ప్రజాపోరాటాల అంతిమ విజయంపై గాఢ విశ్వాసం ఉందనీ అన్నారు. ఈ కవితా సంకలనాన్ని అమరుడు కా॥ పరిటాల శ్రీరాములుకు అంకితమిచ్చారు.

చివరగా విరసం కార్యదర్శి కా॥ వి. చెంచయ్య విరసం ప్రచురణ, శ్రీశ్రీ సాహిత్య సర్వస్వ సంపుటాలలో ఒకటి అయిన "ప్రజ"ను ఆవిష్కరిస్తూ శ్రీశ్రీ తన సుదీర్ఘ సాహితీ జీవితంలో నిత్యం ప్రజలకై ఎలా నిలిచాడో సోదాహరణంగా తెలిపాడు. ఈ సంపుటంలో వేలాదిగా వున్న ప్రశ్నలూ, జవాబుల్లో శ్రీశ్రీ తాత్విక దృక్పథం, సామాజిక పరిస్థితులు, వాటికి తాను కోరు

కునే పరిష్కార మార్గాలు, ప్రజా వుద్యమాల పట్ల అనుబంధం, పౌరహక్కులకై ఆయన చేసిన సేవ వున్నవన్నారు విరసం శ్రీశ్రీని హైజాక్ చేయలేదని, నక్సల్బరీ శ్రీకాకుళ వుద్యమాల, విప్లవసాహిత్యోద్యమం ఆయనను విరసానికి నాయకుణ్ణి చేశాయని అన్నారు. జీవితంలో తుది శ్వాస వరకూ శ్రీశ్రీ పురోగామి శక్తులకు మద్దతునిచ్చాడనీ, తన శాశ్వత చిరునామా విరసం అని అన్నాడనీ పేర్కొన్నారు. 'కష్టజీవి'కి ఇరువైపులా వున్నవాడే కవి అని శ్రీశ్రీ చెప్పినట్టుగా రచయితలు ప్రజల పక్షం వహించాలని, పాలకవర్గం కొమ్ముకాసే రచయితలు ప్రజాద్రోహులనీ కా॥ చెంచయ్య తన ప్రసంగాన్ని ముగించారు.

## చుండూరు హరిజనులపై దాడులకు పాలకులే బాధ్యత వహించాలి.

గుంటూరు జిల్లా చుండూరు గ్రామంలో భూస్వాములు హరిజనులపై చేసిన దారుణమైన దాడులు మానవ జాతికే మాయని మచ్చలాంటివి. భూస్వాములూ, పోలీసులూ కుమ్మక్కై ఈ దాడులు చేశారనేది బహిరంగ సత్యమే. హరిజన యువకుల్ని పోలీసులు ఊరి బయటకు తరిమితే, భూస్వాములు కత్తులు, బరిసెలు, బాకులతో తరిమి తరిమి నరకడం వారి రాక్షస ప్రవృత్తిని చాటుతోంది. చంపి బస్తాల్లో కుక్కి పొలాల్లో పారవెయ్యడం, శవాలను పొలాల్లో తొక్కడం వారి హింసా ప్రవృత్తికి పరాకాష్ఠ.

హరిజనులపై భూస్వాములు చేసే దాడులకు పాలకవర్గాలే బాధ్యత వహించాలి. తెలుగుదేశం అధికారంలో ఉన్నప్పుడు తెలుగుదేశం భూస్వాములు, కాంగ్రెస్ అధికారంలో ఉన్నప్పుడు కాంగ్రెస్ భూస్వాములు హరిజనులపై దాడులు చెయ్యడం పరిపాటైపోయింది. ప్రభుత్వం, పోలీసుల అండదండలు చూసుకునే భూస్వాములు ఈ దాడులకు పాల్పడుతున్నారు.

హరిజనులపై దాడులలో చుండూరు సంఘటన మొదటిదీకాదు, చివరిదీ కాబోదు. కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు అధికారం కోసం పోటీపడడంతో బాటు హరిజనులపై దాడుల విషయంలో కూడా పోటీపడుతున్నాయి. పాదిరికుప్పం, కారంచేడు, నీరుకొండ లాంటి ఎన్నో సంఘటనలు జరిగినా మన చట్టాలు, కోర్టులు ఆ దోషుల్ని శిక్షించలేకపోతున్నాయి. ఈ దాడుల్ని పాలకవర్గాలు ప్రోత్సహిస్తున్నాయనడానికి ఇంతకంటే నిదర్శనం అక్కరలేదు.

చుండూరు హరిజనులపై జరిగిన ఈ అమానుష దాడిని విప్లవ రచయితల సంఘం తీవ్రంగా ఖండిస్తోంది. దోషుల్ని శిక్షించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

—వి. చెంచయ్య, విరసం కార్యదర్శి.

○ అక్టోబర్ 28 కొడవటిగంటి కుటుంబరావుగారి పుట్టినరోజు సందర్భంగా కొడవటిగంటి వరూధినిగారు ప్రముఖ విప్లవ కథా రచయిత కా॥ అల్లం రాజయ్య 'మధ్యవర్తులు' కథకు కొ.కు. అవార్డు ఇస్తారు ఈ సభ అక్టోబర్ 27వ తేది సాయంత్రం గుంటూరులో జరుగుతుంది. కొ.కు. అవార్డుకు న్యాయ నిర్ణేతలు రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావుగార్లు.

# స్వీకారం

1. సెంట్రీ (విప్లవ కవితా సంకలనం) విరసం మహబూబ్‌నగర్ జిల్లా యూనిట్ ప్రచురణ. 56 పేజీలు. వెల : 5 రూ. ప్రతులకు : అరుణతార, సృజన అడ్రసులు.
2. నర్మెట్ట నా తల్లి : కో. ప్ర. వచన కవితలు. విరసం నెల్లూరు జిల్లా యూనిట్ ప్రచురణ. వెల : 5 రూ. ప్రతులకు : వి. చెంచయ్య, 6-5-13, కావలి-524 201.
3. రక్తసిక్తసోపానాలు - పరిటాల శ్రీరాములు సంస్మరణలో - చంద్రహాస కవితలు. విరసం అనంతపురం జిల్లా యూనిట్ ప్రచురణ. 72 పేజీలు. వెల : 10 రూ. ప్రతులకు : వి. చెంచయ్య, 6-5-13, కావలి-524 201, నెల్లూరు జిల్లా.
4. మొదట మనం మానవులం, పౌరులం ఆ తర్వాతే ఉద్యోగులం. (ఉద్యోగ క్రాంతి ప్రసంగ పాఠం) - వరవరరావు. విరసం అనంతపురం జిల్లా యూనిట్ ప్రచురణ. వెల : 2 రూ. ప్రతులకు : వి. చెంచయ్య, 6-5-13, కావలి-524 201, నెల్లూరు జిల్లా.
5. పాలు (కథలు) : బి యస్. రాములు. 74 పేజీలు. వెల : 6 రూ. ప్రతులకు : కొత్తగూడెం బుక్ ట్రస్ట్, యన్.జె. నగర్, ఖమ్మం-507 120.
6. మహిళా మార్గం - జనవరి - జూన్ 1991. బులెటిన్ - 3. వెల : 4 రూ. సంవత్సర చందా : 12 రూ. చిరునామా : ఎ. సత్యవతి,

డోర్ నెం. యస్. 6, పెద వాల్తేర్, ఆదర్శనగర్, విశాఖపట్నం - 530 017.

7. టోడో సమస్య - పూర్వాపరాలు. ఆంగ్లమూలం : రాధాకృష్ణ. అను వాదం : అనంత రామారావు. 15 పేజీలు. వెల : 2 రూ. ప్రతులకు : కొత్తగూడెం బుక్ ట్రస్ట్.

8. కవితా భారతి : తెలుగులో భారతీయ కవిత్వం. అనుసృజన : డా॥ దేవరాజు మహారాజు. 200 పేజీలు. వెల : 35 రూ ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001.

9. కవితా ప్రపంచం - మినీ కవితలు : మానుకొండ నాగేంద్రప్రసాద్, వెల : రు. 1-75 ప్రతులకు : మానుకొండ నాగేంద్రప్రసాద్, సాయి పూర్, ముత్యవరం పోష్టు, వయా కల్లూరు, ఖమ్మం జిల్లా - 507 209.

10. రహస్తంత్రి : కవితా సంకలనం. వేగుంట మోహనప్రసాద్. పేజీలు 174+7. వెల : సాదాప్రతి 40 రూ. లైబ్రరీ ప్రతి 100 రూ. ప్రతులకు : వి. మోహన్‌ప్రసాద్, "ఛాయ", జర్నలిస్ట్స్ కాలనీ, మొగల్రాజపురం, విజయవాడ - 10.

11. బహుముఖం : కవితా సంపుటి యార్లగడ్డ రాఘవేంద్రరావు, 60 పేజీలు. వెల : 10 రూ. ప్రతులకు : విశాలాంధ్ర అన్ని బ్రాంచీలు.

12. జనం సాక్షి : బులెటిన్ నెం. 1. మే - జూన్ 1991. వెల : 3 రూ. చిరునామా : భార్గవ, ఇం. నెం. 46-411-ఎ, బుధవార పేట, కర్నూలు.

13. బండ కింద బతుకులు (జనపదం). కైతికాల పోశెట్టి. 76 పేజీలు. వెల : 6 రూ. ప్రతులకు : కొత్తగూడెం బుక్‌ట్రస్ట్.

14. యుద్ధం. తిర్మల్ కవిత. 40 పేజీలు. వెల : 5 లూ. ప్రతులకు : యన్. అరుణ, 5-52, ఆపోజిట్ బస్టాండ్ రోడ్, వైరా, ఖమ్మం జిల్లా- 507 165.

15. అవిశ్రాంతం (కవితా సంపుటి). సి.వి. కృష్ణారావు. 62 పేజీలు. వెల : 12 రూ. ప్రతులకు : నెలనెలా వెన్నెల, 5ఎ - పొట్టిశ్రీరాములు నగరు, మాసాబుటాంక్, హైదరాబాద్ - 500 457.

16. కంజిర - పొయిట్రీ బులెటిన్ 3 వెల : 2 రూ. ప్రతులకు : కంజిర, 46-16-23, దానవాయిపేట, రాజమండ్రి - 533 103.

# వాళ్ళడిగేది ఒక్కటే....

పెద్దపులి కొట్టిపోయిన పెద్దోడి సంగతేమయిందని వాళ్ళడగరు
ఎలుగుదాడి చేసిన సిన్నోడి సంగతేమయిందని వాళ్ళడగరు
మలేరియ పిప్పిజేసిన మల్లన్న సంగతేందని ఎప్పుడూ వాళ్ళడగరు
వానాకాలంలో దారులన్నీ మూతబడితే
సంతలో సరుకులెట్లా తెస్తారని వాళ్ళడగరు
కడుపులో బిడ్డడు అడ్డంపడితే దవాఖానకు దారెట్లా అని వాళ్ళడగరు
ఫారెస్టోడు మేకపుల్లెరకోసం
చిల్లెరిగా ఎగబడితే జులుమేందని వాళ్ళడగరు
కాసే సీతాఫలాలను
కాంట్రాక్టరు పట్నాలకు తరలించే కరారేందని వాళ్ళడగరు
మా భూముల గుంజుకోని, మా అడివిని దూరంజేస్తే
మా బతుకేమైతదని వాళ్ళెవ్వరూ, ఎప్పుడూ అడగరు
వాళ్ళడిగేది ఒక్కటే......... "అన్నలొచ్చిన్రా" అని.

—పుపరి

---

# విజ్ఞప్తి

అరుణతార ఆర్థిక ఇబ్బందుల్లో వుంది. దీనికి కారణం బకాయిలు పేరుకు పోవడమే. చందాదారులూ, ఏజంట్లూ బకాయిలను వెంటనే చెల్లించి, అరుణ తారను ఆదుకొని తమ బాధ్యతను నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాం.

1991 జనవరి నుండి

| | | |
|---|---|---|
| విడి కాపీ | — | 4 రూ. |
| సంవత్సర చందా | — | 40 రూ. |
| జీవిత చందా | — | 500 రూ. |

చందాలు D.D.ల ద్వారా గానీ, M.O.ల ద్వారా గానీ పంపవచ్చు. M.O. చేసేవారు M.O. ఫారం కింది కూపన్‌లో తమ అడ్రసు తప్పక రాయండి. —సం॥

---

గమనిక : "అత్యాధునిక కవిత్వ ధోరణులు" శీర్షికను స్థలాభావం వల్ల ఈ సంచికలో వెయ్యలేకపోతున్నాం. గమనించగలరు. —సం॥

131 ARUNA TARA - AUGUST 1991 H/GTR-70
Annual Subscription Rs. 40/- Single Issue Rs. 4/-

గల్పిక :

# అర్హత

"సార్ మీ పార్టీలో సీటివ్వరూ ?"

"ఏం చదువుకున్నావ్ ?"

"ఎమ్మే .."

"టిప్పాగాడివయితే బాగున్ను ...."

" ... .... .... "

"పోన్నీదే కులం ?"

"తెలీదు ...."

"మరి మతం ?"

"తెలీద్సార్ ..."

"మనీ పెట్టుబడి పెట్టగలవా ?"

"లేదు ...."

"మర్డర్లు చేయించగలవా ?"

"లేద్సార్ ...."

"తలలు మార్చడం ?"

"రాదు ...."

"పోనీ పిక్‌పాకెటింగ్ ?"

"రాద్సార్ ...."

"సినీ నటుడివా ?"

"కాదు ...."

"పోనీ పారిశ్రామికవేత్తవా ?"

"కాద్సార్ ...."

"అసమ్మతి వర్గం అండుందా ?"

"లేదు ...."

"అతగోడికి అల్లుడవుతావా ?"

"కాను ...."

"అయితే నీవు నామినేషన్ వేయడానికి పనికిరావు."

"...మరి ?!?"

"ఓటింగ్ చేయడానికి వరుసలో నిల్చో"

"!?!?!?..."

—బజరా

Printed at Konarka Printers, Kavali on behalf of Venkataramana Printers, Guntur-1. Revolutionary Writers' Association



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M107 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | bhanusree |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |